ఓం

సచ్చిదానంద పరబ్రహ్మణేనమః.



# సూక్ష్మ మోక్ష మార్గము.



ఇయ్యది

శ్రీ తారక బ్రహ్మానుభవి యగు

పూడిపెద్ది - సాంబశివరావు గారిచే

రచియింపఁబడినది.



చెన్నపట్టణము

ప్రాతచాకలపేటయందుండు

పమ్మి - త్యాగరాయసెట్టిగారి

శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రకటింపఁబడియె.

1915. సం.



# వేదాంత గ్రంథముల ప్రకటన.

వేమనపద్య రహస్యార్థ తాత్పర్య బోధిని దీనిలో ఇదివఱ కెన్నఁడును అచ్చుపడని కొన్ని పురాతన అనుభవ పద్యములు చేర్చఁబడియున్నవి. ౧౬౦ పుటలుగల ప్రథమ సంపుటము. ప్రతి ౧-కి వెల రూ. ౧ ౦ ౦

| | |
|---|---|
| వేదాంత కఠిన పదార్థమంజరి వచనకావ్యము. | ౦ ౪ ౦ |
| పునర్జన్మ సందేహ నివర్తిని వచనకావ్యము. | ౦ ౪ ౦ |
| సద్యోముక్తిబోధిని వచనకావ్యము. | ౦ ౫ ౦ |
| వేదాంత ప్రశ్నోత్తర ముక్తావళిఅనెడి గురుశిష్యసంవాదము. | ౦ ౬ ౦ |
| అనుభవానంద దీపిక వచనకావ్యము. | ౦ ౬ ౦ |
| మృత్యుంజయబోధిని వచనకావ్యము. | ౦ ౨ ౦ |
| సహజాద్వైతానుభవప్రకాశిక వచనకావ్యము. | ౦ ౨ ౦ |
| సామెతల బ్రహ్మజ్ఞాన రహస్యార్థబోధిని వచనము. | ౦ ౫ ౦ |
| బ్రహ్మజ్ఞాన ఉపదేశవాక్యంబులు, పరమహంసవిద్య. | ౦ ౩ ౦ |
| మనోవ్యాధికిమందు. | ౦ ౨ ౦ |
| పాపవిమోచని. | ౦ ౨ ౦ |
| హేమతారకవిద్య. | ౦ ౨ ౦ |
| జీవన్ముక్తిదాయిని, పుత్రోత్సాహ ప్రదాయిని. | ౦ ౩ ౦ |
| సూక్ష్మమోక్షమార్గము. | ౦ ౫ ౦ |
| అజ్ఞానధ్వంసిని. | ౦ ౪ ౦ |
| విగ్రహారాధన మీమాంస. | ౦ ౨ ౦ |
| పరమపురుషార్థ పంచ ప్రశ్నోత్తర రత్నములు. | ౦ ౪ ౦ |
| శుష్కవేదాంత సిద్ధాంతుల గర్వాపహారి. | ౦ ౩ ౦ |
| పీఁడేవాఁడు అను వేదాంత గ్రంథము. | ౦ ౨ ౦ |
| గగనవిద్య, బ్రహ్మజ్ఞాన గానామృతము. | ౦ ౩ ౦ |
| జీవతత్వప్రబోధ కుసుమావళి. | ౦ ౩ ౦ |
| జీవేశ్వర సంయోగ రహస్యము. | ౧ ౦ ౦ |
| సుజ్ఞానతత్వ పూర్ణోదయంబను బ్రహ్మగీతా రహస్యము. | ౦ ౮ ౦ |
| ఆనందరామాయణము వచనకావ్యము. ఇందు రామాయణ కథయంతయు సమగ్రముగ నున్నది. | ౧ ౦ ౦ |

# పుస్తకముల జాబితా.

| పుస్తకము | వెల |
|---|---|
| గురుశిష్యసంవాద - వైద్యచింతామణి. | ౧ ౧౨ ౦ |
| సీతారామాంజనేయ సంవాదము. టీకాతాత్పర్యము. | ౧ ౪ ౦ |
| కాళహస్తిమాహాత్మ్యము వచనకావ్యము. | ౦ ౪ ౦ |
| భక్తలీలామృతము ౬౩ శివభక్తుల చరిత్రములుగలవి. | ౧ ౦ ౦ |
| శ్రీరామకృష్ణ పరమహంసదేవగారి దివ్యజీవిత ఉపదేశ వాక్యములు. | ౦ ౮ ౦ |
| సప్తఋషిస్తోత్ర రామ స్తవరాజము. | ౦ ౨ ౦ |
| వారుణీఘటోదయ శంభులింగోపాఖ్యానము. | ౦ ౨ ౦ |
| అచలగీతరత్నావళి ౨౬౦ పద్యములు. | ౦ ౩ ౦ |
| సుందరకాండము. తాత్పర్యసహితము. | ౧ ౦ ౦ |
| భగవద్గీతలు. తాత్పర్యసహితము. | ౦ ౧౪ ౦ |
| భగవద్గీత వచనకావ్యము. పాకెట్టుసైజు. | ౦ ౪ ౦ |
| అప్పకవీయము శుద్ధప్రతి గ్లేజుకాకితములు. | ౧ ౦ ౦ |
| డిటో సాధారణ కాకితముగలది. | ౦ ౧౨ ౦ |
| బృహజ్జాతకము టీకాసహితము. | ౦ ౧౦ ౦ |
| కాలామృతము శుద్ధప్రతి. | ౦ ౬ ౦ |
| డిటో గ్లేజుకాగితములు. | ౦ ౮ ౦ |
| శ్రీలక్ష్మీస్తోత్ర రత్నత్రయము, టీకాతాత్పర్య సహితము. | ౦ ౧౨ ౦ |
| విష్ణుపురాణము. ద్విపదకావ్యము. | ౦ ౧౦ ౦ |
| మణిత్రయి తాత్పర్యసహితము. | ౦ ౬ ౦ |
| శేషధర్మము వచనకావ్యము. | ౦ ౧౦ ౦ |
| ఆంధ్రనామ సంగ్రహము. ఆంధ్రనామశేషము సటీకము. | ౦ ౫ ౦ |
| రత్నమాలికాపరిణయం హరికథ. | ౦ ౨ ౦ |
| హరిశ్చంద్రోపాఖ్యానం హరికథ. | ౦ ౨ ౦ |
| తారకామృతసారము. | ౦ ౪ ౦ |

ఇంకను అనేక సంస్కృతాంధ్ర గ్రంథములు దొరకును. వలయువారు దిగువ విలాసమునకు వ్రాసికొనవలయును.

పమ్మి - త్యాగరాయసెట్టి,
శ్రీరాజరాజేశ్వరీ నికేతన ప్రెస్. ప్రాతచాకలపేట, మద్రాస్.



ఓం

శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః.

# సూక్ష్మ మోక్ష మార్గము.

శ్లో॥ అనంతజన్మ సంప్రాప్తే కర్మేంధన విదాహినే।
జ్ఞానానల ప్రభావేన తస్మై శ్రీ గురవేనమః॥

శ్లో॥ అఖండ సచ్చిదానంద మవాఙ్మానస గోచరం।
ఆత్మాన మఖిలాధార తస్మై శ్రీగురవేనమః॥

ఓ ప్రియసహోదరులారా! వినుండు సకల జన్మములందును ధర్మార్థాచరణంబైన మానుషజన్మంబు దుర్లభం బందుఁ బురుషత్వం బు దుర్లభమం బదియు శతవర్షపరిమితంబైన జీవితకాలంబు నియతంబై యుండు, నందు సగమంధకార బంధురంబై రాత్రి రూపంబున నిద్రావ్యవహారంబుల నిరర్థకంబయి చనుఁ జిక్కిన పంచాశతవత్సరంబులందును బాల్య యౌవన కౌమార కైశోరవయోవిశేషంబుల వింశతి హాయనంబులు గడచు, కడమ ముప్పది వత్సరంబు లింద్రియంబులచేతఁ బట్టువడి దురవగాహనంబున కామక్రోధలోభమోహ మదమత్సరంబులను పాశంబుల గట్టుపడి విడివడ సమర్థుఁడుగాక, ప్రాణులకంటె మధురాయమానమైన తృష్ణలోనై భృత్యతస్కర వణిక్కర్మంబులఁ బ్రాణహానియైన నంగీకరించి పరార్థంబుల నర్థించుచు రహస్యసంభోగ చాతుర్యసౌందర్య విశేషంబుల ధైర్యవల్లికాల పిత్రంబులైన కళత్రంబులను మహానీయ మంజుల మధురాలాపంబులంగలిగి. వశులైన శిశువులను శీలవయోరూపధన్యులగు కన్యలను వినయవివేక విద్యాలంకారులయిన కుమారులను, జననీ జనకులను, సకల సౌజన్యసింధువు

లయిన బంధువులను ధనకనకవాహన సుందరంబులయిన మందిరంబులను సుకరంబులయిన పశుభృత్యనికరంబులను వంశపరంపరాయత్తంబులయిన విత్తంబులను వర్జింపలేక సంసారంబు నిర్జింప నుపాయంబుగానక దంతువర్గంబున నిర్గమద్వార శూన్యంబైన మందిరంబుజేరి చిక్కువడి, వెడలెడిపాటవంబు సాలక తగులువడు కీటకంబు చందంబున గృహస్థుండు స్వయంకృత కర్మబద్ధుండయి శీతోష్ణతరాది సుఖంబులఁ బ్రమత్తుడయి నిజకుటుంబ పోషణపారవశ్యంబున విరక్తిమార్గంబుఁ దెలియలేక స్వకీయ పరకీయ భిన్నభావంబున నంధకారంబునం బ్రవేశించు గావున గౌమార సమయంబున స్వానుభవమోక్ష బోధగలవారై పరమభాగవత ధర్మంబనుష్ఠింపవలయు దుఃఖంబులు వాంఛితంబులు గాక చేకుఱుభంగిని సుఖంబులు గాలానుసారంబులై లబ్ధంబులగు గావున వృథాప్రయాసంబున నాయుర్వ్యయంబు సేయఁదగదు. ఓ ప్రియభ్రాతృలారా ! సీ॥ కంటిరే మనవారు ఘనులుగృహస్థులై గ్రక్కొన్న వెత్తితనము! భద్రార్థులై యుండి పాయరు సంసారపద్ధతి నూరకపట్టువడిరి। కల్లయోనులందెల్ల గర్భాద్యవస్థలఁ బురుషుండు దేహియై పుట్టుచుండు। దన్నెఱుంగక కర్మతంతుబద్ధై కడపట ముట్టడు భవశతంబులకునైన॥ ఆ॥ వె॥ దీన శుభములేదు దివ్యకీర్తియులేదు। జగతి బుట్టిబుట్టి చచ్చిచచ్చి। పారలనేల మనకు బుట్టనిచావని। తోరివ వెదకికొనుట దొడ్డబుద్ధి॥ అందుకు,

"అనంత శాస్త్రంబహువేదితవ్య మల్పశ్చకాలో బహువశ్చ విఘ్నాః।
యత్సారభూతం తదుపాసితవ్యం హంసోయథా క్షీరమివాంబు మిశ్రం॥

నీరుకలిసియున్న పాలను హంస నీరుపాలను వేరు దీయునట్లు వివేకపురుషుడు చతుర్వేదములను. అష్టాదశపురాణములను, షట్ఛాస్త్రములను 28 ఆగమముల సారమయిన ధర్మార్థ కామమోక్షములు పురుషార్థములు. వీటిలో సారమైనది. పరమపురుషార్థమైన మోక్షమునే గ్రహించును గాని తక్కినవి గోరజాలడు. ఏమన. అన్నిటికంటెను హెచ్చుగల దానియందే యిష్టముంచుట స్వాభావికము. గావున మో యన్న

లారా! ఇమ్మహీమండలంబున యఖండ గౌతమీ తీరమందున్న ధవళే
శ్వరంబను శ్రీరామపాదక్షేత్రంబున నవతరించిన శ్రీశంకరమంచి నా
రసింహ సద్గురునిప్రియ శిష్యుండగు పూడిపెద్ది సాంబశివరావునకుస్వాను
భవమోక్షబోధపూర్వము శ్రీవరాహభగవంతుని ప్రియశిష్యుండైన ఋ
భుమహర్షి తనప్రియ శిష్యుండగు నిదాఘునికొరకుపదేశించినట్లున్ను దేవ
గురుండగు శ్రీమద్దక్షిణామూర్తిస్వాములవారు తనప్రియశిష్యుండైన
బ్రహ్మదేవునికొఱకుపదేశించినట్లున్ను, యుపదేశించినందున. ప్రస్తుతమీ
బోధయేతికిగిగ్రంథత్వక్రమముగా సకలముముక్షువుల కుపయోగనిమిత్తము
వ్రాయబడినది. మరియు అణిమాద్యష్టైశ్వర్యములు కి. మోక్షమున కంతరా
యములు గావున వానియందు విగతసంగుడు మరియచరణ సరోజస్థితల
లితాంతరంగుడునగువాడు మృత్యుదేవత నపహసించి మోక్షమునొందు
టకించుకైనను సందేహముండదని పెద్దలవాక్యంబులు మిథ్యంబులుగావు
ఓ ప్రియభ్రాతులారా! ఈలోకమునందనేకులు యనేకవ్యాపారములు
మోక్షముకొరకు జేయుచున్నారు. ఏవన, చ॥ నరకలనాశ్రమంబులజాతు
ల వర్ధసీతులన్। యడవులదానధర్మముల నాకులనంబుల వేషభాషల। స్జ
డల దిగంబరిత్వములచాటుట సద్గురురాజచంద్రుచే బడక। నవిద్యయున్
జడసి పారునే ముక్తివధూటి చేరునే? అదియునుంగాక. చ॥ చదువులు
పెక్కుగా జదివి శాస్త్రవివేకము నేర్చి ధర్మము। ల్మొదలగుయోగవిద్య
లను బోధలనెన్నిటి విప్పిపిగినన్! మృదువగు రాజయోగము నిమేషణ
మాత్రము బొందకుండిన। న్వదలదు చిత్తసంశయము వాసనయున్ జడ
దయ్యధర్మజా॥ మరియును, సీ॥ గుడిగుండములకొండ గుహాల కారడవు
కూరనారల నిరాహారములను। పండగపర్వాల పాడినిపంటను నేర్పునేరం
బుల నోర్పుబనుల। నిప్పుల నీళ్లను చప్పిడుప్పిళ్లను తీరాల తిరునాళ్ల తిప్ప
టలను।వడుగుల పెండ్లిండ్ల వన్నెల వాసుల వ్రాతల చదువులవాదము
లను। విందుల వినుకూళ్ల వితరణగుణముల। పొందుపోరటలను మోక్ష

మబ్బదయ్యా! ముక్తికాంతామణి నాధుజేరకున్న నరులకధిప॥ ఇంకయును
పద్యము॥ చదువులన్ని చదివి చాలవివేకియై। మగుడి తన్నెరుగ మందజ
నుడు। వ్యర్థచదువుజదివి వెఱ్ఱియై చెడిపోవు। విశ్వదాభిరామ వినురవేమా॥
క॥ ఎన్నివిధంబులనైనను । నున్నది యున్నట్టికన్న యోగులసేవన్ ।
తన్నే తానెరుగవుపోదన్నా ।మాయా ప్రపంచమంతయు దానై ॥ గీ॥ఇట్టిగు
రుని జేరకెన్నిపోకలుబోవ । చిత్తశుద్ధిలేదుచింతపోదు । మాయమాయ
లాడి మటుమాయ మంత్రాల దొలగిపోదు నాత్మదెలియనీదు. క॥ మా
యావాదులు పలువిధ। మాయలుగల్పించి యుపముమాయింతురయా।
మాయకువెలియై చిత్తము బాయని గురుజ్ఞాన నిష్ట బడయుముజీవా॥
గనుక॥ మ॥ ఘనతందారక సాంఖ్యయోగములచే గష్టించగానేల
యింద్రియముల మర్ధింపగానేల చెక్కసగాముందట గానుపించు ఘట
మున్। గన్నట్లు బ్రహ్మంబుగా। దనుదాగాంచిన యంతలో నిఖిలమున్
దానైవెలుంగందగున్॥ సీ॥ సకలవిద్యలునేర్చి సభజయింపగవచ్చు బూ
ర్ణుడై రణమందు బోరవచ్చు। రాజరాజై బుట్టి రాజ్యమేలగవచ్చు హేమ
గోదానంబులియ్యవచ్చు। గగనమందున్నచుక్కల నెంచుకోవచ్చు జీవ
రాసులపేర్లు జెప్పవచ్చు। అష్టాంగయోగంబు లభ్యసింపగవచ్చు నేక
రీతిగరాయిమ్రింగవచ్చు । దామరసగర్భ హరపురంధరులకైన । తన్ను
తా తెలుసుకొనుట తరముగాదు। భూషణవికాసశ్రీధర్మపురనివాస। దుష్ట
సంహారనరసింహ దురితదూర॥ సీ॥ నిగమాదిశాస్త్రముల్ నేర్చిన ద్విజు
డైన యజ్ఞకర్తగు సోమయాజియైన। ధరణిలోపల ప్రభాతస్నానపరు
డైన నిత్యసత్కర్మాది నిరతుడైన। నుపవాస నియమంబు లొందు
సజ్జనుడైన గావివస్త్రముగట్టుస్వామియైన। దండిషోడశమహాదానపరుం
డైన సకలయాత్రలు సల్పుసరసుడైన। గర్వమున గష్టపడితన్నుతా దెలి
యకున్న। మోక్షసామ్రాజ్య మొందడు మొదటికే। భూషణవికాసశ్రీధ
ర్మపురనివాస। దుష్టసంహారనరసింహదురితదూర॥ ఓ స్వాహా స్వాహా
దరులారా! గీ॥ శుష్కవేదాంత సిద్ధాంత సూటిపరులు। ఆత్మనెరుగక

యర్థముల్ వ్యర్థముగను। జెప్పుచుందురు లోకులఁ జెఱచుకొఱకు। నిజము
నిష్ఠూరమై కల్లనిజములాయె॥ శ్లో॥ నాస్తినాస్తి మహాభాగ కలికాలస
మంయుగమ్ । స్మరణాత్కీర్తనాదేవ ప్రాప్నోతి పరమాంగతిమ్॥
క॥ గోవిందనామకీర్తన గావించి భయంబుదక్కి ఖట్వాంగధరి। త్రీవిభు
డుసూరగొనియెను। కైవల్యము దొల్లి రెండు ఘడియలలోనన్॥ అయితే
నీలోకమున ముముక్షువులకు యభిప్రాయమొకవిధముగాను, జేయుటొక
విధముగాను, జెప్పేదొక మాస్తరుగా నిట్లు త్రికరణశుద్ధి లేకుండా మోక్ష
క్షము నందిచ్ఛపుట్టియూ మోక్షము నొందలేక తప్పిపోవుచుందురు. లోకు
లందరు మఱి మోక్షము నందిచ్ఛపుట్టుటచేతనుగదా? సకలమైన సత్క
ర్మమొదలగునవి జేయుచుందు దందురు. అయితే నిచ్ఛపుట్టిన వస్తువు
యొక్క ధర్మము తెలియకుండ నిచ్ఛపుట్టకూడదే. ఇచ్ఛపుట్టిన వస్తువు
యొక్క ధర్మము దెలియకపోవుటవలన నా వస్తువును బొందజాలరు.
అందుకే, ఉ॥ ఎందరు దేవతల్ చనిరి యెందఱు తాపసులభ్రష్టులై ।
యెందఱు రాజులేగిరి మఱెందరు యోగులు జోగులైరిగో । విందుని
పాదపద్మములు వీడని భక్తి భజింప నేరకా । చందము నొందకీవు
మనసా హరిపాదము లాశ్రయించుమా?॥ కాబట్టి ఓ ప్రియస్నేహితు
లారా! మోక్షధర్మములు ముందుగా త్రికరణశుద్ధిగా గ్రహించి దాని
గురించి ప్రయత్నించినదో మోక్షము కరతలామలకముగా నుండును.
అందుకు ౧. మోక్షమనగానేమి? ౨. ఆమోక్షమెవరికి? ౩. ఆమోక్ష
మెప్పుడు వచ్చేది? ౪. యా మోక్షమెందు నిమిత్తము కావలెను? ౫.
ఆమోక్షమే సాధనవలన లభించేది? ఈ పంచప్రశ్నములకు శ్రుత్యుక్త్య
నుభవములతో నుత్తరవు రావలయును. ఓ స్నేహితులారా! ఈజగత్తు
లో నొందఱు, పద్యము॥ తనలో నెప్పుడు నుండెడి । తను దెలియగ
లేడు నిన్ను దగమా జెలియన్ । దను దెలసుట నిను దెలసుట । సనకాది
మునిప్రసన్న సంపగిమన్నా॥ అనునట్లు మొదటను తానెవ్వరో యను
రెండవ ప్రశ్నను విచారించెద. సావధానముతో నాలకించవలెను!——

మోక్షమెవరికనగా, తనకే మోక్షము గావలసియున్నది. తాననగా నెవ రో విచారించెద. అయితె తాననగా దేహమా? ఇంద్రియములా? జీవుడా? నాదమా?, బిందువా? కళా? హంసా? ఆత్మా? పరమాత్మా? ఇవన్ని దేహములో నున్నవిగదా? ఇందులో నేది తానని శంకరాగా, మొదట నజ్ఞాన దశయందు దేహమే తానని దోచినను పిమ్మట మృతు లైనవారిని జూచినపుడు జీవుడులేచిపోయినాడనే లోకోక్తివలన తాను దేహముగాదని స్పష్టముగా దెలియవచ్చినది. అయితె నిపుడు తానే జీవుడు గాని, మరి తాను దేహేంద్రియములు గాదు. తానే జీవుడు గదా తానుగాని దేహేంద్రియములు తాగానని దెలసుకొనుచున్నాడు. యింకా తనకన్యమయిన వేదశాస్త్ర పురాణేతి హాసములు దెలసుకొ నుచున్నాడు. మఱియు తనైన జీవుడు తనై యున్నప్పుడు తన యుత్ప త్తి స్థితి లయములు, స్వరూప స్వభావములు మొదలైనవి దెలియవలె నుగదా? మరియు తనకు జీవుడని యెవరు వచ్చి జెప్పినారు? అంటే; "శబ్దసిద్ధిలోకంబువలన దెలియును." అంటె; నలుగురనుకొన్నమాటై పోయినదిగాని, తనకేమి తెలియదు. అయితే, పద్యము॥ తన్నుతా నెరు గడు తానెవ్వరికినేర్పు? పాలు మాలి తిరుగు పశువుకొడుకు ! కాసుల కొరకైతె కర్మముల్ గట్టురా॥ వి॥ ఇకను జీవునియుత్పత్తిస్థితిలయము లు విచారించెదము:— జీవుని యుత్పత్తి విచారించునెడ యెన్నిసంవ త్సరములు తలక్రింద బడినను దెలియబడజాలదు. స్థితి నాలోచించు నెడ ఇదిగో తాను దేహేంద్రియములు గాదనిన్ని తానే జీవుడనిన్ని దెలియబడుచున్నది. యింతకు మిక్కిలి మరిదెలియబడకుండానున్నది. పోసి, లయమాలోచించునెడ యసలు జీవుడే పోవుచున్నప్పుడు మరిదె లిసికొనునదేదున్నది. ఈమూడుకాలములయందు దెలియనట్టుగా స్పష్ట ముగా కనబడుచున్నది. అయితే మరెప్పుడు దెలసుకొనేది? లోకము లోననుభవములేనిదే యెట్లు వేదాంతులనిపేరు పెట్టుకొనుచుందురో యీరహస్యము దెలియకుండా నున్నది. ఇట్లనే, తే॥ తారకయోగము

దెలియఁగ । నేరక వేదాంతవాక్య నికురుంబముచే । నూరకవాదించుచుఁ
జెను । వారికిమోక్షంబుగలదె వాయుకుమారా॥ అనగా, తనయొక్క
స్వరూపానుభవమనెడి తారక నిష్ఠలేక వేదాంత వాక్యార్థములను ప్రతి
పాదించి సభలలో వాదించుచు స్వేచ్ఛగా ప్రవర్తించువారికి సంసార
దుఃఖరహితమయిన మోక్షము కలుగదని తాత్పర్యము. మఱియు, గీ॥
రాజ యోగంబుఁ బూని నిరంతరంబు । పట్టుగా నభ్యసింపంగఁ బ్రా
లుమాలి । కొన్ని వేదాంత యుక్తులు గూడబెట్టి । పలుక నేర్చిన బ్ర
హ్మానుభవము గలదె॥ అనగా, రాజయోగమును శ్రవణ మనన నిధి
ధ్యాసముల చేత వాడుక చేయుటకు బద్ధకించి వేదశాస్త్రమందలి యుక్తుల
నుకొన్నిటిని కూర్చుకొని సభలలో ప్రసంగింప నేర్చుకొనగానే తన్ను
తాదెలియు విజ్ఞానముగలిగి దుఃఖరహితము కానేరదని తాత్పర్యము.
ప్రస్తుతకాలమునందు శాస్త్రజన్యజ్ఞానపండితులు కొంతమంది గృహస్థు
లను దుర్బోధనలుజేసి యధోగతి పాలు జేయుచుందురు. క॥ ఎక్కడి
చదువులు బోధలు । మక్కువ ననుభవములేని మాటలు వినగా ।
పుక్కిటి పురాణములకే । జక్కుల సంతోష మిలను సద్గుణవేమా॥
మరియును, క॥ శ్రీరాజ యోగవిద్యా । పారీణుని కబ్బుగాక పరమ
సుఖంబీ । ధారుణి హరులయు మంత్రవి । చారుల కదిదొరకదన్న సం
పగిమన్న॥ ఎన్నివిధములనైన నాలోచించినప్పటికిని యుత్పత్తి, స్థితి,
లయులలో దెలసినదికాదు. మంచిదికను జీవుని స్వరూపస్వభావములు
విచారించెదము. అందులో మొదటను జీవుని స్వరూపము విచారిం
చెదము. ఎంతకాలపర్యంతము జీవుని స్వరూపమేమోయని విచారించి
నను లవలేశమైనా దెలియబడదు. ఇకను దాని స్వభావమునుఁ బట్టి
స్వరూపమును బట్టుకొనవలయును. ఎట్లనగా, దీపముస్వరూపము దాని
ప్రకాశము స్వభావము ఎక్కడనో దీపము వెలుగుచుండగా, స్వరూప
మయిన దీపమగపడకపోయినను, దాని స్వభావమైన ప్రకాశమునుబట్టి
దాని జూడగుండా పోయినట్లు, జీవుని స్వభావమునుబట్టి దానిస్వరూప

ముసుఁబట్టుకొనవచ్చును. అయితే జీవునిస్వభావమేమనఁగా నది విచారించఁదగును. జీవునిస్వరూపముఁపయికి యగబడుటలేదు, దానిస్వభావము పండితులకును పామరులకు నొక్క విధముననే యుండవలయును. అందుకే యనుభవములేని యైశ్వర్యమెందుకని మహా పెద్దలనెదరు॥ పద్యము॥ స్వానుభూతిలేక శాస్త్రవాసనలచే। సంశయంబు చెడదు సాధకునకు। చిత్ర దీపమునను జీకటి చెడనట్లు॥ వి॥ ఇందునుగురించి యొక దృష్టాంతము విచారించెదము. అదేమన, యొకమనుష్యుఁడు నిద్రించుచున్నాఁడు, ఒకఁడు మరణించిపడియున్నాఁడు, మూఁడవవాఁడు మేలుకొని కూర్చున్నాఁడు. ఆ మూఁడవవాఁడే గదా, వీఁడు నిద్రించుచున్నాఁడనిన్ని వీఁడు మరణించి పడియున్నాఁడనిన్ని దెలసుకొనుచున్నాఁడుగాని మొదటివాఁడున్ను రెండవవాఁడున్ను యొకరి నొకరెరుగరుగదా? అయితే నీముగ్గురిలో నేయేతత్వంబులున్నవో కొంతమాత్ర మాలోచించవలయును సుమండీ! ఈ కూర్చున్నవాఁడు యీయిద్దరిని తనికీసేయగా మొదటివాని దేహములో నూపిరి యాడుచున్నది. గనుక వీఁడు బ్రతికియున్నాఁడని తక్షణము గ్రహించుకొన్నాఁడు. రెండవవానిలో నూపిరి యాడ లేనందున నున్ను, యొడలంతచల్లగానున్ను యుదరముగట్టిగానుండుటచేతనున్ను మరణించి యున్నాఁడని వెంటనే గ్రహింపునకువచ్చినది. ఇంతమాత్ర మనుభవముచేతను గ్రహించుకొనుటకుశాస్త్రంబులేలా? అందుకే, శ్లో॥ శాస్త్రజ్ఞానం బహుక్లేశం బుద్ధిశ్చలనకారణం। ఉపదేశాద్ధరింభుధ్వా రమతే సర్వకర్మసు॥ అనగా, శాస్త్రజన్యజ్ఞానము సర్వదుఃఖములకు హేతువును బుద్ధిచాంచల్యమునకు కారణముగా నున్నది గాన, సద్గురూపదేశమున యనుభవజన్యజ్ఞానమునగు తన్నుతా దెలసి సర్వకర్మలయందును రమించవలెను. శాస్త్ర జన్యజ్ఞానమువలన తన స్వరూపస్వభావములు తల యొంత పగలఁగొట్టుకొన్నను తెలియబడదు. పద్యము॥ అంకిలెరిగి మాట లాడనేర్చినపుడె। పిన్న పెద్దతనము లెన్న నేల? పిన్న చేతిదివ్వె పెద్దగా వెలుగదా?॥ వి॥ ఉచ్ఛ్వాస నిశ్వాసములచేతనే గదా యీలో

కములో మరణించినాడో లేదోయని తెలసుకొనుచున్నారు. ఈగొప్పచి హ్నము చేతనుగ్రహించేదానికి "గోళ్లతో చీరవలసినదానికి గొడ్డలితో జీరుకొనుచున్నారు." నెట్టో మొట్టో నలుగు రేదంటే యది నమ్మి సకలము యినకర్మాదులుసల్పుచున్నారేగాని నిజమరయకుండానున్నారు. పోనీ మరి మరణించినవాని సంగతి విడిచిపెట్టెదము. ఇకను నిద్రించుచున్న వాని గురించి చక్కగా విచారించవలయును. నిద్రించు చున్నప్పుడు యుచ్ఛ్వాస నిశ్వాసములుండుటచే బ్రతికే యుండుదురని విశదముగా తెలియవచ్చినది:— అయితె నిద్రించునపుడు జీవుడున్నాడా? అంటే? జీవుడున్నాడు. జీవుడనగా ప్రాణవాయువు గదా, యా ప్రాణవాయువు యుచ్ఛ్వాసనిశ్వాసరూపమున నొకగడియారపుయంత్రమువలె రాత్రింబగళ్లు యేకరీతిగా దేహములోనుండి వెలుపలికిలోపలికి చలించుటవలన హంసయని చెప్పబడుచున్నది. ఆనిద్రించునపుడుహంసయున్నదా? అంటే? యున్నది, మరినేననేదేది? అదేలేదు, తక్కినవన్ని యున్నవి. అయితే నన్నియుండి ఐదవతనము లేనట్లున్నది. ఓ సహోదరులారా! చూడండి. యిక్కడను పట్టి వేదాంత సిద్ధాంతి నూటిపరులెట్లు జీవేశ్వరైక్యము, జీవబ్రహ్మైక్యము జేయుచున్నారో తెలియకుండానున్నది. మఱియు కపటవేదాంతులు॥ శ్లో॥ యథాఖర శ్చందన భారవాహీ సారస్యభాగీ నతుచందనస్య । ఏవం హి శాస్త్రాణి బహూ న్యధీత్యా సారం నజానః ఖరవత్సరోచ్ఛ్వనః॥ అనగా, మంచి గంధపుచెక్కలను మోయుగార్ధభము పరిమళ మెఱుగనటుల సకల వేదశాస్త్రములు చదివి విదత్సారాంశమగు పరవస్తువు నెఱుగకపోయిన యెడల గార్ధభమువంటివాడే యగును॥ శ్లో॥ చతుర్వేద ధరోవిప్ర సూక్ష్మబ్రహ్మ నవిద్యతే। వేదభార భరాక్రాంత స్సవై బ్రాహ్మణగార్ధభః॥ మంచిది. నిద్రలో నున్నదానికంటే మేలుకొన్నవో యధికమేమి వచ్చుచున్నది? అంటే? తెలివివచ్చినందున సకలజనులు మేలుకొనుచున్నారు. అయితె నిపుడు పెద్ద మహానువస్తువులు గలవు. అవేవనగా, 1 దేహము, 2 జీవుడు, 3

తెలివి. ఈ మూడు పెద్దవస్తువులలో తనై నవస్తువు తెలివేగాని, దేహము జీవుడుగాదు, ఈ జీవుని ధర్మమే తెలివని చెప్పిన యెడల స్వరూపముండగా స్వభావము నశింపగూడదు. అదెట్లనగా, దీపమునకు స్వభావమయిన ప్రకాశోష్ణత్వములు. యీ దీపముండగా నశించనట్లు జీవుని స్వభావమే యీ తెలివైతే యీజీవునివిడిచి సుషుప్తిలో నెందుకు విడిచి పోవుచున్నది? గావున యీ తెలివి యీ జీవుని స్వభావముగాదు. ఇవుడన్నిటిని గుర్తెరుగుచున్న దే తెలివి, ఇదే తానని స్పష్టముగా యనుభవముద్వారా తెలియవచ్చినది. మరియందుకు సందియములేదు, శ్రీమద్దక్షిణామూర్తిస్వాములవారి యనుభవముగూడ నిట్లనే వ్రాయఁబడి యున్నది:— అదేమన, శ్లో॥ దేహోనాహ మహందేహీ దేహసాక్షీతి నిశ్చయాత్ । జన్మమృత్యు ప్రహీణోసా ఇతి వేదాంత డిండిమః॥ ప్రాణోనాహ మహందేవః ప్రాణసాక్షీతి నిశ్చయాత్ । క్షుత్పిపాసో పశాంతిఃస్యాదితివేదాంత డిండిమః॥ సర్వమును తెలివేసృష్టించుచున్నది. సర్వము యీ తెలివే తెలుసుకొనుచున్నది: యీ తెలివిని తెలుసుకొనే దేదియులేదు. తెలివి యుండుటచేతనే సుఖదుఃఖములు, జననమరణములు, సంకల్పవికల్పములు, భయాభయములు, పుణ్యపాపములు, స్వర్గనరకములు, ధర్మాధర్మములు, మొదలయిన ద్వంద్వములు ఈ తెలివిచేతను చిత్రవిచిత్రమయిన రెయిల్ వే, టెల్లిగ్రాఫ్, ఫోనోగ్రాఫ్, సైనోమొటోగ్రాఫ్ బెలూన్సు మొదలయిన పనులుచేయబడుచున్నవి. మఱియు నీతెలివిచేతనే బి- ఏ- యమ్- ఏ, బిఏ- బియల్, బారిష్టర్, మెట్రిక్యులేషన్, మొదలైన పరీక్షలు ప్యాసులవుచునున్నారుగాని, యీ తెలివి యీ దేహములోని కెట్లువచ్చినదో (అది మనకిప్పుడు దెలియవలెను.) యీ దేహములోనికి రాకముం దేరూపమో? యిప్పుడేరూపమో, యీ దేశము విడిచిన తరువాత నేమగునో? దేని యాకర్షణద్వారా యీ తెలివి దేహములోనికి ప్రవేశించినదో, కొన్నాళ్లుండుట కారణమేమో, తిరిగిపోవుటకు కారణమేమో, రోజు యీ తె

లివి వచ్చుటకు, యుండుటకు పోవుటకు కారణములేవో; రోజు యీ తెలివిరాకముందు వచ్చినప్పుడు పోయినపుడేమగునో యీ మొదలయిన కారణములగు దేవరహస్యములను దెల్పు వాడే కారణగురువు. గీ॥ సూచక నిషిద్ధ బోధక వాచకులను । గడగి కామ్యకర్మ సమయ కార ణులును । నవగ వెనమంత్రు దేశికులందులోన । సద్గురుండగు కారణా చార్యవరుడు॥ కావున సద్గురువులసేవయే సర్వదా సేయవలయు. మరి యిట్టి తెలివియే తానని తెలుసుకొన్నంత మాత్రము నేమి ప్రయో జనములేదు సుమండీ? ఏమన, వేపాకు వేపాకని తెలిసినా చేదే; తెలి యకున్నా చేదే, ఆ వేపాకున్నంతసేపు చేదుపోదు. దానిని సద్గురుద్వా రా దహిస్తేచేదుండదు. చేదు దానితోనేపోవును. అలాగుననే తెలివి యున్నంతసేపు ద్వందముల్లైన సుఖదుఃఖములు, సంకల్పవికల్పములు, జననమరణములు,ధర్మాధర్మములు, పుణ్యపాపములు, స్వర్గనరకములు మొదలగునవి యుండును. దానినే యిపుడు సద్గురునివలన విడిపించు కోవలెను. ఇట్టి తెలివియొక్క యుత్పత్తి, స్థితి, లయములు, దాని రూ పము, పరిమాణము, స్థానము మొదలయినవి విచారించి తెలుసుకోవల యును. ఓ భ్రాతులారా? కొంతమంది యీ తెలివే సమస్తమును తెలు సుకొనుచున్నది. ఇదేసమస్తము సృష్టించుచున్నది: యింతకన్న దైవ మేదున్నది గావున, యిదే బ్రహ్మమని నమ్ముకొని యానందించుచు న్నారు గాని, బ్రహ్మధర్మము లేవియో తనైన తెలివియొక్క ధర్మ ములేవియో విచారించక లేనిపోనివిషయానందములోనున్న విద్యానం దములోనున్న మగ్నులై తన్నుగానక మాయామధుపానమత్తులై చెడి పోవుచున్నారు. మనకు తెలివి రోజు వచ్చుచు, యుండుచు, పోవు చున్నది. ఆ సమయములో నా తెలివిని పట్టుకొనే మార్గమున్నదేమో విచారించెదము. రోజు నందఱికిని తెలివి వచ్చుచు, యుండుచు, పోవు చు, ముగ్గడిగా గిరగిర దిరుగుచున్నదిగాని, తెలుసుకొనే మార్గము లేన ట్టున్నది. ఈ లోకములో ననేకమంది గొప్పగొప్ప యుద్యోగములు

ఈ తెలివివలననే సంపాదించుచున్నారు. ఈ తెలివిచేతనే లేనిపోని మాయావిద్యలు పొట్టకొరకు యభ్యాసముజేసి మరింత మాయా తదాకారాకారత్వమునొంది యహంకారమమకారత్వములచే మదాంధులై చెడిపోవుచున్నారుగాని వొక్కరైనా, తెలివి పైనున్న రహస్యమగు బ్రహ్మవిద్యనుగ్రహించుదామని బుద్ధి పుట్టకుండానున్నది. ఎట్లన, చం॥ ఎఱుఁగవు ముక్తిమార్గమిది యెక్కడి కర్మము దాపరించెఁ జే । టెఱుఁగని బోటి తామగని కంపుగఁ బెండ్లి యొనర్చినట్లు దు । ష్కరమగు కామ్యకర్మములఁ గాలముఁ బుచ్చెద వేలబాపురే। సరసముగాదు నీకు మనసా హరిపాదములాశ్రయించుమా?॥ ఓ సత్పురుషాదరులారా! యింక నాలకించండి. ఉ॥ గాలము మ్రింగినట్టి ఝషకంబు తుదిం జెడి పోయినట్లునీ । వేల భ్రమించి సంస్మరణ హేయసుఖంబులఁ గోరెదక్కటా! । కాలుదు పోఁడఁ జొచ్చెఁ గడకాలము దాఁకొనవచ్చెఁ గానదో । పాపి నడంచివేగ మనసా హరిపాదములాశ్రయించుమా?॥ మఱియును, ఉ॥ తల్లికిఁ గల్గినట్టిదయ దాదికి గల్గునె యెన్ని చూడనీ । చిల్లరవేల్పులెన్నైనరు జిల్కఁగ బ్రోచుట కల్లగాదనేఁ । జెల్ల జగత్కుటుంబి వెడచేయక తొల్లిటి వారిఁ బోలెన-। న్నెలనఁ బ్రోవుమంచు మనసా హరిపాదములాశ్రయించుమా?॥ మఱియు నీ తెలివిని తెలివిచేతనే తెలుసుకొనవలెను. ఏమన, తెలసుకొనేది తెలివిన్ని తెలియబడేది జగత్తును, తెలసుకొనేదిగొప్పదా లేక తెలియబడేది గొప్పదాయుంటే, తెలసుకొనేదేగొప్పది. తెలియబడేది తెలసుకొనే దానికి విషయమగుచున్నది. గావున అభిన్న జ్ఞానముచేత తెలివియొక్క స్వరూపము దెలియబడదు. అభిన్నజ్ఞానముచేతను గ్రహించుకొనవలెను. అనగా, తెలివిని తెలివిచేతనే తెలసుకొనవలయును. ఎట్లన, శ్రుతి;—మనస్సైవ మనశ్ఛిత్వా పాశం పరమ బంధనం । భవాదుత్తార యాత్మానం నాఽసావన్యేన తార్యతే॥ అనగా, విషమువిషమువల్లనున్ను, బాణము దాని సమానమగు మరియొక బాణముచేతను, ఖండింప బడునట్లు తెలివిని తెలివి

చేతనే తెలుసుకొనవలెను. అయితే నీ తెలివి రోజు నందరికి వచ్చుచు యుండుచు బోవుచు గిరగిర ముగ్గడిగా తిరుగుచున్నది. ఈ మూడు గతులలో నెట్లు తెలివిని పట్టుకొనవలెనో ఆ మార్గమేలేనట్లు గనబడు చున్నది. అయితే ననుభవములేనిమార్గముండునా? ఈలోకములో నెన్ని వేదాంతములు నేర్చిన వారికైన నట్లనే యనుభవము. కొందరు వట్టి వేదాంతులు, ఉ॥ కాయమనిత్యముగా దెలివి గానక మంత్రలయాది యోగసా । హాయముల్లైన సిద్ధులను ప్రజ్ఞలుగా దలపోసి మూఢులై । మాయులనందువారు నమమంత్రపుయోగులు గాని ముక్తికి । డాయ గలేరు వీరలకు డంభమెమోక్షము లెంచిచూడగా॥ ఉ॥ అంబరయాన సిద్ధులకు నాసలుసేయుచు మంత్రతంత్రమా । డంబర వృత్తిగొందురు విడంబము నొందుటగాని ముక్తిచే । తంబసలేదు వారలకు భ్రామిక సంస్కృతి వెంట నంటిలో । కంబుల ద్రిప్పుచుండ కడగానగ నియ్యాక రాజశేఖరా॥ అని యిట్లు సూతుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. నట్లు వ్యాసుండు ధర్మజుం గనుంగొని యిట్లనియె. ఇట్లు రెండవ ప్రశ్న మైన తానెవరని విచారింపగా తెలివివద్దకు వచ్చి తెలివికి మీదకు లేక పోయె, క్రిందివికాకపోయె, మధ్యను అహం యహం యని ప్రేలాడుచు నున్నది. ఈప్రశ్నను విచారించినచో యింతకఠినముగా నున్నది. ఇం కను రెండవప్రశ్నయగు మోక్షమనగానేమో, విచారించి జూచు నెడ మార్గముండునేమో ప్రయత్నముచేసి చూతము. కాబట్టి ఓ భ్రాతృ లారా! సావధానముగా నాకర్ణించండి. పద్యము॥ బాలుడుగానిభోగి। స్త్రీలోలుడుగాని విషయ శీలుడుగానీ। మేలైన బోధగలిగిన। చాలదె మరి ముక్తిగన్న సంపగిమన్నా॥ విత్తపరాయణుడైనా । మత్తచ కోరాక్షులందు మగ్నుండైనా । నుత్తమ పురుషుడె కాడా । సత్తామా త్రంబుగన్న సంపగిమన్నా॥ శ్లో॥ బోధోన్య సాధనేభ్యోహి సాక్షాన్మో క్షైక సాధనమ్ । పాకస్య వహ్నివత్ జ్ఞానం వినా మోక్షోనసిధ్యతి॥ మోక్షమనగా 1 సాలోక్య, 2 సామీప్య, 3 సారూప్య, 4 సాయుజ్య,

5 సార్ష్టిత్వ, 6 విదేహకైవల్యములని యారు మోక్షపదవులు గలవు. అందు సాలోక్యమనగా, సగుణ స్వరూపమగు స్వామి యుండెడి స్వర్గ వైకుంఠ కైలాసములలో నెక్కడనో యొక చోటనుండుట. సామీప్యమనగా, యాస్వామివారి దగ్గరగనుండుట. సారూప్యమనగా, యా సగుణ స్వరూప భగవంతునివలె చతుర్భుజములు కుండలములు కిరీటములుండుట. సాయుజ్యమనగా, సగుణస్వరూపమగు భగవంతునియందైక్యమగుట (సుషుప్తిలోనైక్యమగునట్లు) సార్ష్టిత్వమనగా, శాపానుగ్రహమహిమలు, విశ్వామిత్ర గోరఖ్‌నాథులవలె ప్రజ్ఞలుగలిగుండుట. ఇకను విదేహకైవల్యమనగా, సగుణస్వరూపులగు బ్రహ్మవిష్ణు మహేశ్వరులకు మూలమయిన పరాశక్తి కధిష్ఠానమైన నిర్గుణ పరబ్రహ్మమునకున్ను తానైన యీ తెలివికిన్ని యైక్యముసహజమైయున్నదని శ్రుతి గురు స్వానుభవముల వలన గ్రహించునదే విదేహకైవల్యము. ఇందు కొకదృష్టాంతము విచారించుడి. అదేమన, సముద్ర జల ప్రతిబింబమునకున్ను తటాకజల ప్రతిబింబమునకున్ను ఘటజల ప్రతిబింబమునకున్ను యుపాధులు భేదముగా నుండినను, యా ప్రతిబింబము లన్నియు సూర్యునియందైక్యమగునట్లు, తానైన తెలివికిని త్రిమూర్తులగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు మూలమైన పరాశక్తి కధిష్ఠానమగు యఖండసచ్చిదానందాచల పరిపూర్ణ పరబ్రహ్మమునందైక్యము సహజమై యున్నదని శ్రుతిగురుస్వానుభవములతో గ్రహించునదే విదేహకైవల్యమనే నిజమోక్షము దీనిపేరే యోగము. "యుజ్యతఇతి యోగః." యను వ్యుత్పత్తిచేత యోగ శబ్దమునకు యైక్యము. ఇంకను యోగమనగా,

తే. ప్రత్యగాత్మ స్వరూపుఁడై పరఁగు తనకు । రమణ పరమాత్ముఁడైన శ్రీరామునకును । సమర సైక్యాను సంధాన సరణియొద్ది । యదియ యోగంబు సదుపాయమాంజనేయ॥ మొదటి యైదు మోక్ష పదవులు స్వప్నతుల్యములు విదేహకైవల్యము మెళకువవంటిది.నిజ మనుకొన

స్వప్నమునుమేలుకొన్నగానే యొక్క సెకండులో స్వప్నము తప్పైనట్లు మొదట నిజమనుకొన్న మొదటి పంచముక్తులు విదేహకైవల్యముముందర నుత్త రైపోయినవి. అనగా, మొదటిపంచముక్తులుమిథ్యలయిపోయినవి. ఆ విదేహకైవల్యమునకే పంచముక్త్యాతమని మహాపెద్దల యనుభవము, దానిపేరే నిష్ప్రతియోగిక బ్రహ్మమని ఋభుగీతలోను జెప్పబడి యున్నది. ఇదే యన్ని మోక్ష పదవులకన్న మిక్కిలి గొప్పది. అటు వంటి యారవముక్తి నొందుటకు, సీ. పిడికిట పుష్యరాగ మణిబెట్టుక వ్యర్థులు రాళ్లకోసమై। యడవి జరించనేల మిమునాత్మను దెలియక సంత జోగులై। పుడమి చరించనేల శివపూజ క్రమంబులు మానసే లనా। కడపట పార్లనేల నుదకంబులు లేక నశించనేలయా। గడములు కాళహస్తి యజవందిత సాంబశివ మహాప్రభో॥ సీమము బుట్టి రావ ణుడు నిత్యము భోజనకాలమందుహా। కోమలి సన్నుతాంఘ్రి నవకో టికి నర్థుల పూజచేసిర। భామణి యేమి మోక్షసిరిసంపద నొంది తరిం చుపైగ శ్రీ। రాములచేత జచ్చె త్రిపురాంతక జూడు మీభక్తిలే కయూ। భూమిని కాళహస్తి భువనేశ్వర సాంబశివ మహాప్రభో॥ అటు వంటి మహానుభావులే నిజమోక్షము నొందలేక పోయినారు. మరి ప్రస్తుతపు మాయావాదులయిన వట్టి వేదాంత శిరోమణు లెట్లు విదేహకైవల్యము నొందెదరో యో సహోదరులారా! ఊహించ వలెను, చ॥ అలయక సప్తవారిధుల నావలి కీవలి కొక్క రీతిగాఁ। గలయఁగ నీఁదవచ్చును నగంబుల నచ్చనగంబుగాఁ గరం। బులఁగొని యాడవచ్చు వభముః గబళింపఁగ వచ్చుగాని। య్యాల విదేహకైవ ల్యము గ్రహింపఁగ రాదు దలంపనేరికిన్॥ ఈ యారు మోక్షపదవులకు సాధనము యొకదానిలో నొకటియున్నదా? లేక వేరువేరుగానున్నదా? ఇపు డది విచారింప బడుచున్నది. ఓ సహోదరులారా? బహు శ్రద్ధగలవారలై వినవలెను. దీనిపేరే భక్తియోగమనిపేరు. భక్తిత్రయ ముచేతను వచ్చెడి మోక్షము నాలుగువిధములు. అష్టాంగయోగము

చేతనువచ్చెడిమోక్షము సార్ష్టిత్వము. జ్ఞానముచేతనువచ్చెడి మోక్షము విదేహాకైవల్యము. భక్తిత్రయమనగా బాహ్యభక్తి, అనన్యభక్తి, యేకాంతభక్తి, అందు బాహ్యభక్త్యనంగా, శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం । అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనం॥ అనఁగా కీర్తనం, శ్రవణం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం॥ యివి తొమ్మిది విధముల బాహ్యభక్తి, వాటియర్థము చక్కఁగా గ్రహించి వాటి ప్రకారముగా ప్రవర్తించుటవలన సాలోక్యపదవివచ్చును. ఇదే దృఢముగానుండిన-చో సామీప్యపదవి వచ్చును. అనన్యభక్త్యనగా, శ్లో॥ బహూనాం జన్మ మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే । వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సు దుర్లభః॥ అనగా, సర్వత్రా పరిపూర్ణుడై స్వప్రకాశుడై యుండెడు వాసుదేవుడు సర్వమును చరాచరాత్మకమైన ప్రపంచము సర్వముగావున సమస్తము వాసుదేవ మయమని నిజముగా ననుభవము గలిగుంకుట బహుదుస్తరము. దీనివల్ల సారూప్య పదవి వచ్చును. ఇక నేకాంత భక్త్యనగా, శ్లో॥ యోమాం పశ్యతిసర్వత్ర సర్వంచమైపశ్యతి॥ తస్యాహ్య హం నప్రణస్స్యామి నచమేన ప్రణస్స్యతి॥ అనెడి గీతావాక్యము॥ అనగా, భగవంతుడైన శ్రీహరి పరమాత్మస్వరూపుడనిన్ని యా పర మాత్మ స్వరూపుడు. శ్రీహరియనిన్ని యా శ్రీహరి సమస్త మందుం డునని తెలసుకొనుట. దీనివలన సాయుజ్య మోక్ష పదవి లభించును. ఇక్కడనుభవము విచారించెద. అదెట్లన, సుషుప్తియందు మనస్సు యజ్ఞానాంధకారమునందు లయించుటవలన, తడిభూమియందు పూడిన వి త్తనములయించి మరల మొలకలెత్తునట్లు మరల జాగ్రతావస్థయందు మనస్సు తోఁచుచుండును. మఱియు నిద్రయందు యా మనస్సుతోడ జీవు డజ్ఞానమునందు యణగి యజ్ఞాని యగుచు తానే బ్రహ్మామని తెలి యక తన్నుమరచి యంధకారమగు పాడుబావిలో పడిన గ్రుడ్డివానివలె

పడియుండుటయు. ఇందువలన జీవుడు ముక్తినొందజాలడు. లోజుపందుటకిని సాయుజ్యమోక్షపదవి నొందుచునేయున్నాడు. దానికి మరొకపేరు స్వరూపమనో నాశనము. దీని రహస్యము తన్నుతా దెలియని శాస్త్రజన్యజ్ఞానపండితులకు దెలియజాలదు. మరియు సార్షిత్వమనగా, యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులనెడి యష్టాంగయోగముల వలన సార్షిత్వము గలుగును. ఇకను యారవదగు విదేహకైవల్యము. భక్తిత్రయముచేతనున్ను యష్టాంగయోగముల చేతనున్ను లభించదుగాని, జ్ఞానముచేతను లభించును. ఇందుకు సాధన మేమన, సాధనచతుష్టయసంపత్తిగలవాడే యధికారి. సూత్రభాష్యములో నిట్లు వ్రాయబడి యున్నది;— అథాతో బ్రహ్మజిజ్ఞాసేతి - ఏతస్యార్థః, అథ ఇత్యుక్తేః, సాధనచతుష్టయ సంపత్యనంతరం, అతఃపూర్ణాధికారిత్వాత్, అథాతో బ్రహ్మజిజ్ఞాసా బ్రహ్మవిచారఃకర్తవ్యేత్యర్థః। ఏవం ప్రకారేణ వ్యాససూత్రే కథితం। తస్మాద్బ్రహ్మవిచారః కర్తవ్యః॥ అనఁగా, సాధన చతుష్టయ సంపత్తిగల మహానుభావులే బ్రహ్మవిద్య కధికారులుగాని తక్కినవా రెన్ని విద్యలు నేర్చినను అధికారత్వములేదు. ఎట్లన, లోకములో నుపనయనము లేనిదే బ్రాహ్మణు డెట్లు కాజాలడో యట్లు సాధనచతుష్టయముయొక్క యపరోక్షానుభవము లేనిదే బ్రహ్మవిద్య కధికారత్వము గలుగదు. ఇకను సాధన చతుష్టయమన. 1 నిత్యానిత్య వస్తువివేకము, 2 ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము, 3 శమాది షట్కము, 4 ముముక్షుత్వము. ఇందులో నిత్యానిత్య వస్తువివేకమనగా, నిత్యమైన దేదియో యనిత్యమైన దేదియో యిహాముత్రార్థ ఫలభోగ విరాగ మనగా దేహాది బ్రహ్మ మొదలు సర్వము మిథ్యయని గ్రహించి, యిహపరలోకమందలి సుఖదుఃఖములయందును సకల భోగములయందును కక్కిన యన్నమువలె జూచినట్లు చూచుట. శమాది షట్కమన, శమము, దమము, ఉప

రతి, శ్రద్ధ, సమాధానము, అందులో శమమన. యంతరింద్రియ నిగ్రహము, దమమన, బాహ్యేంద్రియ నిగ్రహము. తితీక్షన, సుఖదుఃఖములగు ద్వంద్వములు సహించుట. ఉపరతియన, తెలివిచేత క్రమ క్రమముగా సకల కర్మానుష్టానములను పరిత్యజించుట. దీనిని సన్యాసమని పెద్దలనెదరు, క॥ సన్యాసులమనిశాస్త్ర । సన్యాసము జేయనందు ఫలమేమి మన । స్సన్యాసము దొరకొనమిక । సన్యాసము కూడదన్న సంపగిమన్న॥ శ్రుతి;— కర్మత్యాగాన్న - సన్యాసో - నప్రేషో చ్చారణేనతు । సంధా - జీవాత్మనో - రైక్యం - సన్యాసః - పరికీర్తితః॥ అనగా, నిది సన్యాసమునకొక ముఖ్యమైన చిహ్నముగాని, వృథాగా, కాషాయవస్త్రములు గోచి ధరించి, శిరముండనముజేసుకొని యారూఢ జ్ఞానమగు తత్త్వమస్యాది మహా వాక్యముల యపరోక్షానుభవ మెఱుంగక నుదర పోషణార్థము కాసులరీతిగా సంచరించుచు నారాయణయని చిలుక పలుకవలె నుచ్చరించుచు పూరీలు, నెయ్యి, పరమాన్నము మొదలైనవి భక్షించి, శాటిగడ్డను ధరించి దక్షిణలు పుచ్చుకొనుచు మస్తెక్కి యుందురు. అటునంటి సన్యాసత్వము పనికిజాలదు. పద్యము॥ ఏమిగానిదాని నెఱుగుట లక్ష్యంబు । సాము జేసి సట్లు సాధ్యపరచి । నీమనిష్ఠవదిలి నిర్గుణమందర విశ్వదాభిరామ వినురవేమా॥ ఇదే ముఖ్యముగా సన్యాసమనే మాటకు రహస్యార్థము. అనగా, సదసత్తులను బాసి, తరువాత నున్నదానిని గ్రహించినవాడే సన్యాసి. వాడే పరమహంస వాడేరాజయోగి దానిపేరే సర్వసంగపరిత్యాగముగాని భార్యాపిల్లలను, యిల్లువాకిళ్లు విడిచిపెట్టి, తన్నుతా దెలియ లేక పిచ్చివానివలె సంచరించుట సన్యాసముగాదు. బాహ్య సన్యాసమువిడిచిన నేమిలాభము? అంతర సంసారమనెడి మనస్సన్యాసము కుదరవలె. ఈప్రకారముగా మఱచిచెడుగుల నాలోచించకుండ చాలామంది చెడిపోయియున్నారు. అట్టి సన్యాసమును గోరక యున్నది యున్నట్టుగా నుండే మనస్సన్యాసము సద్గురురాజచంద్రునిచే యుపదేశము బొందవలె. శ్రద్ధయ

న, తనకు జ్ఞానోపదేశముజేయు సద్గురుని యందు నుపనిషత్తుల యందు
ను మఱియు తన్ను సృష్టించే యీశ్వరుని యందును విశ్వాసముంచుట.
సమాధానమనగా, సద్గురునిచేత నుపదేసింపబడిన తత్త్వమసిమొదలగు
మహావాక్యార్థ రహస్యములను శాస్త్రములయందు జూచుకొని, ఆ
హా! గురువులవారు బోధించిన యర్థమే సరియని తన మనస్సున దృఢ
పరచుకొనుట. తితీక్షయన, సుఖదుఃఖములను, జనన మరణ ములను,
మొదలైన ద్వంద్వములను మీరిన వస్తువునందు మిక్కిలి మగ్నతనొం
దియుండుట, ఇదే శమాదిషట్క-మనిపేరు. ఇకను, శా॥ వైరాగ్యంబు
దృఢంబుజేసి పరతత్త్వజ్ఞాన మార్జించి స॥ ర్వారంభోపరమంబు గైకొని తు
రీయం బంది యీరీతియో। గారూఢుండగు వానికిం గలుగునే యా
గామియున్ సంచిత। ప్రారబ్ధంబులు సంతతంబును బర।బ్రహ్మాత్ముడై యుం
డగాన్॥ సాధన చతుష్టయములో మొదటిదైన నిత్యానిత్య వస్తువివే
కముయొక్క యపరోక్షానుభవము లేనివారితో బ్రహ్మవిద్య విషయ
మై ప్రసంగించనే గూడదు. ఇదే యభ్యాసము. దీనినే మొదటను
వేదాంతులను పరీక్షచేయవలెను. దీని యనుభవము గలిగినవాడైతే
వానితో ప్రసంగించినచో చందనములో కర్పూరమువేసినట్లుండు, లేని
యెడల భంగులో నుమ్మెత్త గింజలు కలిపినట్లుండు. శ్రుతి;—ఆత్మా
నాత్మా వివేకేన - పున సంసార - నిర్వృతిః। తద్వినా జన్మకోట్యాపి-
బంధచ్ఛేదో - నసిధ్యతి॥ అనగా, ఆత్మానాత్మవివేకములేనివారు కోటి
జన్మములకైనను మోక్షము నొందజాలరు. శ్రుతి;— అతస్సర్వేషాం
కైవల్యముక్తిః - జ్ఞాన మార్గే - ణోక్తా। నకర్మ - సాంఖ్యయోగో పాస
నాదిభిః॥ అనగా, తన్ను తా దెలియుటవలననే జననమరణములులేని
విదేహ కైవల్యమనెడి నిజమోక్షము లభించునుగాని, కర్మానుష్ఠాన
ము, సాంఖ్యయోగము, హఠయోగము, మంత్రయోగము, దేవతో
పాసన మొదలగువాటిచే లభించదు. చం॥ తన నిజ నాథుని న్వదలి
తప్పక దర్పకు బారి గొట్టువడై। కనుగొని జారులం గలసి కామిని దు

వ్యాకరమైన భంగినిఁ । వన రుహనాభునిఁ వదలి వారక నమ్మల గొలచుండరా । కనుబడ నేలనీవు మనసా హరిపాదము లాశ్రయించు మా॥ ఉ॥ తల్లికిఁ గల్గినట్టి దయవాడికి గల్గునే యెన్నిచూడనీ । చిల్లర వేల్పులు న్నెనరు జిక్కఁగ బ్రోచుట కల్లగాదనేఁ । జెల్లదగత్కుటుంబి విడచేయక తొల్లిటి వారిఁబోలెన । న్నల్లన బ్రోవుమంచు మనసా హరి పాదము లాశ్రయించుమా॥ కాబట్టి, యో సహోదరులారా! ఇవు డనిత్యానిత్య వస్తు వివేకముయొక్క యపరోక్షానుభవము విచారింప బడుచున్నది. నిర్మలచిత్తులై యాకర్ణించవలె:— క॥ దేశిక నాథుని మహాదుప । దేశమువలనఁ వివేక దృష్టివలన । దన్నాశ్రయలము సుషు ప్త్యా । దేశంబని దానికీలు దెలియగవలయుఁ॥ గీ॥ పెద్దలనఁగగొప్ప పెనుకొండలంతేసి । వారుగారునట్టి వారుగారు। తన్నుదానెగన్న ధన్యు లెవ్వారైన। వారెపెద్దలనగవసుమతీశ॥ ఒక్క బ్రహ్మమేనిత్యము తదిత రములైన సమస్త నామ, రూప, గుణక్రియలుగల దేహేంద్రియ ప్రపం చముల నిత్యము. నిత్యమనగా నెల్లప్పుడుండునది. అనిత్య మనగా నెల్లప్పుడుండునది ఒకప్పుడుండి మరియొకప్పుడుండనది. అనగా (బ్రహ్మ సత్యం జగన్మిథ్య) సత్యమనగా మనము పుట్టనపుడును, పుట్టినపుడును, పోయినవెనుకనుండునది. మిథ్యనగా నేమియులేనిది. అయితే శ్రుతిజెప్పి నట్లురుజువుకావలె. మనకేలాగున గనబడుచున్నదనగా, నామ రూప, గుణక్రియలుగల దేహేంద్రియ ప్రపంచములే గనబడుచున్నవి గాని, బ్ర హ్మమెక్కడనైనను గనబడుటలేదు. ఇందు కనుభవము విచారించవలె. అదెట్లన, సుషుప్తి సమాధులలో నామరూపగుణక్రియలుగల దేహేం ద్రియప్రపంచములు బోవుచుండునని శాస్త్రజన్యజ్ఞాన పండితోత్తములు సమాధాన పరచుకొని యానందించు చున్నారు. సరే తథా భవతు అయితే తిరిగి యా సుషుప్తి సమాధులు విడువగానే యా నామరూప గుణక్రియలుగల దేహేంద్రియ ప్రపంచములు తిరిగి వచ్చుచున్నవి. తిరిగి సమాధాన పరచుకొని యూరకున్నారు. సరే మరీ బాగుగా

నున్నది. అయితే నిక్కడను దోషములేవో విచారించినాఫుకారు. అవివే
వన, మొదట నామరూప, గుణక్రియలుగల దేహేంద్రియ ప్రపంచ
ములు లేవని సుషుప్తి సమాధులలో నవి పోయినవని తిరిగి సుషుప్తి
సమాధులు విడువగానే వచ్చుచున్నవని సమాధాన పరచుకొనుటెంత
వివేకహీనముగా నున్నదో సూక్ష్మబుద్ధిచేత గొంచ మాలోచించినచో
చక్కగా గ్రహించవచ్చును. అయితే నిక్కడను రెండుదోషములు సం
భవించుచున్నవి. మొదటను నామరూపగుణక్రియలుగల ప్రపంచములు
లేనివి పోవడము దోషము. రెండవది లేని నామరూపగుణక్రియలుగల
ప్రపంచము తిరిగి పోవడము మరింత దోషము. ఇక్కడ నీ రెండు
దోషములు తెలుసుకో లేకుండా నద్వైతులు సంతోషించుచున్నారు.
శ్రుతియుక్తులు సరిగా నున్నవిగాని యనుభవమునకు హాని గలుగుచున్న
ది. అనుభవములేని యైశ్వర్యమేలా? అని పెద్దలనెదరు. మనకు
పుట్టకముందు ప్రపంచమున్నది. పుట్టినతరువాత నున్నది, పోయిన
తరువాత నుండును. అయితే నేది వచ్చుచు పోవుచున్నది? అంతఃక
నీ తెలివే రోజు మనకు వచ్చుచు పోవుచున్నదిగాని, నామరూప గుణ
క్రియలుగల దేహేంద్రియ ప్రపంచములు రావడము పోవడము లేదు.
అవియున్న దున్నట్టుగానే యున్నవి. ఇక్కడ నీయనుభవము తెలియ
కుండా నద్వైతవేదాంతులు మాయావాదమునొందుచున్నారు. పద్యము॥
అనుభవ మెరుగని గురుచే । విను నతనికి సంశయంబు వీడునె చిత్రా-
ర్కునివలన తిమము బాయునె । సనకాది మునిప్రసన్న సంగమేశునా॥
పద్యము॥ గురునట యెవనికి గురువో । హరిహరి తను దెలియలేని
యాతడు గురువా । గురువనగ సిగ్గుగాదా । శరణాగత సుప్రసన్న సం
గమనాశా॥ మరియును శాస్త్రజన్యజ్ఞాన పండితులు తెలివి తక్కువ
చేతను వాదించెదరు. పద్యము॥ వాదము భేదము గొరకే । మేదినిగల
విద్యలెల్ల మెతుకుల కొరకే । కాదది మోక్షము త్రోవని । సాదరమతి
తెలియరన్న సంగమనాశా॥ ఒక దృష్టాంతము విచారించుడీ! రెయిల్

మీదను గూరుచుండునపుడు యీ రెయిల్ పరుగెత్తుచుండెనేని కిటికీల గుండ చూచెనేని చెట్లు యిండ్లు మొదలగునవి పరుగెత్తులాగున కన బడుచుండునుగాని, నిజమరసినచో యీచెట్లు యిండ్లు మొదలగునవి పరుగెత్తడములేదు. అయితే రెయిల్ పరుగెత్తుటచేత నట్లు భ్రమచేత కనబడుచుండును: ఆ ప్రకారము రోజు నీ తెలివి వచ్చుచు పోవుచుండు టచేత నీ దేహమే వచ్చుచు పోవుచుండునని భ్రమచేత నాలాగు నని దరు. అట్లు రోజు నీ తెలివి రానడము పోవడము (మెలుకు మరుపులు) జననమరణములనబడును. ఈ రహస్యము మూఢులకు దెలియదు. క॥ గూఢార్థముఘను డెరుగును। మూఢాత్ముం డేమియెరుగు మొనసిన వేళన్। గాఢాలింగన సౌఖ్యము। ప్రౌఢాంగన యెరుగుగాని బాలేమెరుగున్॥ కస్తూరివాసన గ్రామసూకరమున కేలాగు దెలుసునో గొడ్రాల బిడ్డకు కుట్టేలాగు దెలుసునో అట్లు పామరులకీ రహస్యము దెలుసును. అయితే నిక బ్రహ్మసత్యం జగన్మిథ్యత్వ మెట్లనగా, "యథరజ్జు సర్పభ్రాంతివతు" యని శాస్త్రజన్యజ్ఞాన పండితులు సమాధాన పరచుకొని మెల్లగా నూరకున్నారు. దృష్టాంతము మాత్రముజెప్పి దార్ష్టాంతిక మాలోచిం చకుండ నూరకున్నారు. మంచిది, యీ దృష్టాంత దార్ష్టాంతికము లెట్లనో విచారించెదము;— దృష్టాంతమునందు భ్రమించిన పాము పాముగాకుండ పాముగా నగబడుచున్నట్లు ప్రపంచము ప్రపంచముకా కుండా ప్రపంచముగా నగబడుచున్నది: దృష్టాంతమునందలి త్రాటినెఱి గినటుల మరియొక బ్రహ్మమును మరియొక ప్రపంచము నెఱిగియుంటే గదా? రజ్జుసర్పభ్రాంతి వచ్చుటకు గారణము. అయితేను పామును త్రాటిని యెఱిగి యుండుటచేతను, పాముపోలిక త్రాటి కుండుటచేతను భ్రమించుటకు తగిన కాలమగుటచేతను భ్రమించుట కవకాశముగలిగి నది. త్రాటి కట్టిమోస్తరుగా పోలిక లేనిచో భ్రమవచ్చుట కవశ్యమే లేదు. మఱియు త్రాటిని పామునెఱిగియుండునటుల మరియొక బ్రహ్మ మును మరియొక ప్రపంచము నెఱిగియుండవలెను. కావున, భ్రమనివా

రణే కావడము లేదు. ఎట్లయినను భ్రమనివారణ జేసుకొనవలె. ఎట్లన, స్వప్నములో నున్నవారికిది స్వప్నమని తెలియనటుల భ్రమలో నున్న వారికిది భ్రమయని తెలియదు. అయితే నిపుడు భ్రమ రావడమా? ఉండడమా? పోవడమా? అంటే రావడమైనది, యుండడమైనది. పోవడములేదు గనుక భ్రమ యింకను తీరడములేదు. మంచిది, యీ భ్రమ బ్రహ్మమునకా? ప్రపంచమునకా? అంటే బ్రహ్మమునకుగాదు ప్రపంచమునకుగాదు. అయితే నిక మరి యెవనికి? తనకు తాననగా నెవరు? దేహమా? ఇంద్రియములా? జీవుడా? అంటే తాననేది దేహేంద్రియాదులుకాదు. సర్వము గుర్తెరుగుచున్న తెలివే తాను తిరిగి నా తెలివివద్దకే వచ్చినాముగాని యింకను భ్రమ తీరడములేదు సుమండీ? ఓ సహోదరులారా! లోకములో నిట్లనే తెలివిలేని వేదాంతులు నిజమయిన వేదాంతపు మార్గము దెలియక గృహస్థులనుఁ బాడుజేయుచు నున్నారు.

ఉ. పెద్దల సేవఁజేసినను బెంపగుఁ గాక వృథాభిమానులై । గద్దరి సుద్దులం దగిలి కానక మూఢులు కొందఱుర్విలోఁ । బ్రొద్దులు పుత్తురట్లు చెడిపోవక సామిని భక్తి గొల్చినన్ । దద్దయు మోక్ష మబ్బుగద దాశరథీ జనకాత్మజాధిపా.

మంచిది, తిరిగి యీ రజ్జుసర్ప దృష్టాంతము ద్వారా త్రాడని తెలియగానె సర్పభ్రమపోయినట్లు ప్రపంచము బ్రహ్మముగా నెఱిగినవో ప్రపంచభ్రమ పోవునని కపటవేదాంతులు సమాధానము జేసుకొని యూరకున్నారు. ఆహా! ఇదెంత సొగసుగా నున్నదో యో మిత్రులారా మీరే గొంత నాలోచించవలెను. అయితే నిక్కడ దోషమేమో విచారించక సంతోషించు చున్నారు. శ్లో॥ విద్యాతపః ప్రాణ నిరోధమైత్రి । తీర్థాభిషేక వ్రతదాన జప్యైః । నాత్యంత శుద్ధిం లభతేంతరాత్మా యథాహృదిస్థే భగవత్యనంతే॥ తాను వేరు బ్రహ్మము వేరంటే పామరులకు బహు ప్రీతికరము నుండునుగాని తానే బ్రహ్మమని యంటే చాలకోపము. అదే మూఢమతి సుమండీ! యిదియునుంగాక, శ్లో॥ క్షణనాశిని సంసారే శరీరే క్షణభంగురే । పంచభూతాత్మకే

బ్రహ్మైక చతుర్వింశతి తత్త్వకే । మలమాంసాస్థి దుర్గంధ భూయిష్ఠే హ్యంకృతాలయే । కావాస్థా నతు తస్మిన్ వై కాయె తనజాత్మకే ॥ అని యధ్యాత్మ రామాయణమందు వ్రాయబడియుండినట్లు మలము, మాంసము, ఎముకలు, మొదలగువానితో నిర్మింపబడిన స్థూలదేహము ఇరువదినాలుగు తత్త్వములుగా భాగింపబడి యున్నది. ఈ పంచమలములతో నిండియున్న స్థూలదేహమే తామనుకొనెడి మోహసాగరములోబడి కొట్టుకొనుపోవుచుండుట దెలియజాలక కర్మతంత్రులయి తమ్ము తా దెలియక వ్యర్థకాల యాపన జేయుచున్నారు. ప్రపంచము బ్రహ్మముగా నెంచుకొనుటెంత తెలివి తక్కువైనది? ఆ దోషమేమనగా, నామ, రూప, గుణ, క్రియలుగల దేహేంద్రియ ప్రపంచమును నామ, రూప, గుణ, క్రియలు లేని బ్రహ్మమును, బ్రహ్మ మనెడి బుద్ధి యెంత బాగాయున్నదో మీరే యాలోచించండి! ఆ దోషము స్పష్టముగా నందరికి సూక్ష్మ బుద్ధిచేత నగబడుచున్నది. మరినేజెప్పనవసరములేదు. అదెట్లున్న దనగా, నొకమనిషికి యొక బ్రహ్మమని పేరుపెట్టి పిలిచినట్టుయున్నది. కాబట్టి దీనివల్లనైనను భ్రమతీరడములేదు. మరెట్లనగా, అసలు త్రాటిని త్రాడుగా తెలుసుకొన్నట్లు బ్రహ్మమును బ్రహ్మముగా తెలుసుకొన్నయెడల ప్రపంచభ్రమ తీరుచున్నది. అదెట్లనగా, కొంచెము చక్కెరను నోటిలో వేసుకొన్నచో తియ్యగానుండునని జెప్పుదురుగదా, యా తీపెక్కడనున్నది? ఆ తీపును తెలుసుకొన్న మనస్సెక్కడనున్నది? అది మనము జెప్పజాలము. ఏమన, తీపును మనస్సును రెండేకమైయున్నందున తీపుగానుండునని జెప్పగలము. అట్లు బ్రహ్మ తదాకారాకారమైతేనే గదా తద్ధర్మము తెలుసును. అందుకు "తత్త్వమసి" యను యుపదేశ మహావాక్య వాచ్యార్థము విడిచిపెట్టి లక్ష్యార్థము దీసుకొనవలెను. అయితే నిక్కడను పదార్థములకైక్యముగాని పదములకైక్యముగాదు. తత్ + త్వం + అసి = తత్త్వమసి. తత్పదమనగా, మొదటను సాధనచతుష్టయ నిత్యానిత్య

వివేకముతో నామ, రూప, గుణక్రియులులేనిది బ్రహ్మమనిన నిరూపణ జేసి యున్నవి. ఇంకను మఱికొన్ని ధర్మములేవనగా, యాదిమధ్యాంత ములు లేనిదిని, స్వజాతీయ, విజాతీయ, స్వగత భేదములు లేనిదిని, యన్నియున్నస్వమను లేవపుమను, స్వతసిద్ధముగా నుండునదని, యన్ని టిలోనుండి యన్నిటి నంటపని యభిన్నమైనదిని యైయున్నది. ఇకను త్వంపదమునకు ధర్మములేవనగా, శాకపోకలు గలిగినదిని, సగుణ త్వము. భిన్నత్వము. చలనత్వముగల తెలివై యున్నది. సగుణధర్మ ములుగల తెలివికిని నిర్గుణధర్మములుగల బ్రహ్మమున కేకత్వమెట్లు గలుగునో యో సహోదరులారా! విచారించుడీ! ఇట్టి స్థితిలో తెలి యనివేదాంతులెట్లు జీవబ్రహ్మైక్యము జేయుచున్నారో దెలియకుండా నున్నది. పద్యము॥ వెక్కసములాడు మనుజుల । మక్కువతో బుద్ధి జెప్పి మాన్పగగలరా । కుక్కలతో కలగట్టిన । చక్కనగా దీరదన్న సంపగిమన్నా॥ ఈ సగుణధర్మములుగల తానైన తెలివికిని నిర్గుణధర్మ ములుగల బ్రహ్మమున కేకత్వ మెటులనో యో యద్వైతులారా! దెలిసియున్నచో జెప్పవలయును. ఎంత తలక్రిందుగాబడిన నేకత్వమే లేనట్లు ధర్మములచేత నగబడుచున్నది. సీ॥ గురుపదాంభోజముల్ గొలువక కల్గునే ప్రవిమలవైరాగ్య భాగ్యమహిమ । గురుపాద తీర్థం బుఁ గ్రోలక కల్గునే జ్ఞాన విజ్ఞాన యోగానుభవము । గురుప్రసాదంబుఁ గొనకున్నఁ గల్గునే పతిలేని చిత్తోప నిజసుఖంబు । గురుతత్వమాత్మఁ గన్గొనకున్నఁ గల్గునే నిరతిశయంబైన పరమపదము॥ తే॥ అట్లు గావున విద్యార్థియైనయోగి । వినయభక్తివెదలోన బెనఁగొనఁగ । నల చతు ర్విధ శుశ్రూషలాచరించి । కొనుచు ననిశంబు గురువుల గొలుచునఘ॥ ఆహా సోదరులారా! శ్లో॥ గురుపాదోదకం పీత్వా గురో రుచ్ఛిష్టభోజ నం । గురుమూర్తిం సదాధ్యానం గురుమంత్రం సదాజపేత్॥ గావున సద్గురుసేవలేనిదే బ్రహ్మవిద్య పట్టువడదు. ఎంతటివాడైన నెంతటివిద్య కైనను గురువు లేనిదే యావిద్య ధర్మమర్మములు దెలియం జాలరు.

ఎన్నివిధములనైనను తానైన తెలివికిని బ్రహ్మమునకు నేకత్వమేలేనట్లు స్పష్టముగా నగబడుచున్నది. ఈప్రశ్నవిచారించునెడ నింతకఠినముగా నున్నది, ఆమోక్ష మెప్పుడువచ్చునో విచారించెదము. మృతిబొందిన తరువాతను విదేహకైవల్యము వచ్చునని చెప్పియెడల తానైన తెలివి పోయిన వెనుకను, తనకు గురుతులేనప్పుడు నిజదేహమువచ్చినను తన కేమిప్రయోజనము లేనందున భవిష్యత్కాలమందు వచ్చెడిమోక్షము ప్రత్యక్ష దోషమును లేక యిటు పిమ్మట కొంతకాలమునకు వచ్చునని చెప్పిన యెడల యిదివరకులేక యిప్పుడే నతుమ వచ్చునది గనుక వర్త మానకాలమందు వచ్చెడి మోక్ష మాగంతుక దోషమును లేక యీ జన్మ మెత్తక మునుపే మోక్షము వచ్చేయున్నదని చెప్పిన యెడల మోక్షముబొందినవాడు మరలజన్మమెత్తుచున్నందున భూతకాలమందు వచ్చెడిమోక్షము పునరావృత్తిగలిగినందున యిట్లు కాలత్రయమందు వచ్చెడి మోక్షమునకు యప్రత్యక్షాగంతుక పునరావృత్తి దోషములు సంభవించుటవలన విదేహకైవల్యమను మోక్షము సాలోక్యాది పదవులవలన నొకదేశమునుండి వేరొకదేశమునకు పోవునదిని యొక కాలమందులేక వేరొక కాలమునందు వచ్చునదినికాదు. ఇట్లు త్రికాలముల యందు వచ్చెడి మోక్షము దోషముగా నగబడుచున్నది. అయితే మోక్షము రాకతీరదనుమండీ! లోకులందరు మోక్షమనుమాట బహు సులభముగా నోటం జిలుక పలుకులవలె నుచ్చరించుచున్నారుగాని, శబ్దార్థక్రియానుభవము దెలియ లేకుండా నున్నారు. అందుకే వేమన గారు చెప్పినదేమనగా, క॥ శ్రుతి దృష్టాంతము లేకనె। మతిహీనుని బల్కినట్టి మాటలు చూడఁగ । సతమని నమ్మగ రాదది । యతులిత మగు పూర్ణపదవి యందదువేమా॥ మోక్షముయొక్క నాల్గవ ప్రశ్న యైన మోక్ష మెప్పుడువచ్చునని విచారించినచో యింత కష్టముగా నున్నది. ఇకను మోక్ష మెందునిమిత్త మిచ్ఛయింపబడుచున్నదనగా, సర్వోత్తమమైనమానవజన్మ మెత్తియుండియు ముక్తినొందనియెడల చతు

ష్పాద జంతువుల వలెనే "పునరపిజననం పునరపిమరణం" యనునట్లు జననమరణ సంసారసాగరమున మునుగుచుండవలసిన యీ దేహేంద్రియాదులకు విలక్షణమైన తన నిజస్వరూపము తా నెరుగక తానుగాని దేహేంద్రియాదులు తాననుకొనుటచే దేహేంద్రియాదులకు సంభవించెడు జననమరణసుఖదుఃఖములు తనయందారోపించుకొని స్థూలదేహాధ్యాసనశంబున తాను దేహరూపమై దేహేంద్రియాదులఁగూడి స్థూల సూక్ష్మ దేహంబుల కవస్థలయిన జాగ్రత్స్వప్నము లంతర్బాహ్యముల వ్యవహరించుచు కారణ దేహావస్థయైన యవిద్యాంధకారమను సుషుప్తి యందు లీనమై మరల యథా ప్రకారముగా దేహరూపమై సూక్ష్మ దేహమునుగూడి యీ ప్రపంచవిషయిక జింహ్వాపస్థాది సుఖముల మరగి, కామక్రోధాదులచే పుణ్యపాపములొనర్చి జననమరణ దుఃఖము లనుబొంది సంకట పడుచుండుట వలన లోకములో జన్మముకంటే నెక్కువ దుఃఖమును మోక్షముకంటే నెక్కువ సుఖమునులేదని సర్వ జనానుభవ సిద్ధమైనందున యీజన్మకర్మ ప్రతిబంధయుక్తమైన జీవుడు యిమ్మానవజన్మమున మోక్షము నొందని యెడల యనేక జన్మముల కంకురమైన లింగదేహభ్రాంతి యనగా యనాద్యవిద్యా నిర్వాచ్యా కారశోపాధిరుచ్యతే॥ అనునట్లు యజ్ఞాన హృద గ్రంథి నశింపక బహు జన్మ కారణ మగుట వలన యీ జన్మకర్మ ప్రతిబంధ నివృత్తికొరకే మోక్షము గావలసి వచ్చినదని స్వానుభవ మోక్ష బోధ సిద్ధాంతము. లోకులు లీ రహస్యము నెరుక "తాబట్టిన కోతికి మూడేకాళ్లన్నట్టు" తామేపనులుజేసినను మోక్షము వచ్చునన్నతలంపు పిచ్చివాండ్ల యభిప్రాయమైయున్నది. అసలు మోక్ష మెందుకొరకు గావలసియున్నదో యీ సంగతిపరోక్షమందు ముందుగా తెలుసుకోవలెను. అది లేకుండా నెన్నిప్రయత్నములు పడిన నేమి ప్రయోజనములేదు. సీ॥ వేదశాస్త్రంబులు వివరించి బుధులచేఁ జదివింపవచ్చుదాఁ జదువవచ్చు। యజ్ఞదాన తపంబు లధికారిజనముచేఁ జేయింపవచ్చుదాఁ జేయవచ్చు। నిల

లోనఁ గలతీర్థములకేగ సన్న్యల బోధింపవచ్చుఁ దా బోవవచ్చు। నష్టాంగయోగవిద్యల నారులకు నుపదేశింపవచ్చు సాధింపవచ్చు॥ తే॥ గాని యెవ్వారికైన విజ్ఞానయోగ। గతిని దేహేంద్రియములరికట్టి మనము। నాఁగి యంతర్ముఖముఁజేసి యనవరతము। నిశ్చల సమాధి నిష్ఠచే నిలుపరాదు। అనగా పండితులచే ఋగ్యయజు స్సామాథర్వణ వేదములనున్ను శిక్షాది షట్శాస్త్రములనున్ను పుత్రాదులచే చదివింప వచ్చును, తానును జదువవచ్చును. అధికారిజనముచేత పౌండరీకాది క్రతువులనున్ను షోడశ మహాదానములనున్ను కాయక, వాచక, మానసిక, తపస్సులనున్ను చేయింపవచ్చును, తాను జేయవచ్చును. ఇతరులను భూమియందున్న గంగాది సమస్త పుణ్యతీర్థములకుఁ బోవు నట్లుపదేశించవచ్చును, తానును బోవవచ్చును. పండితులకు యెనిమిది విధములైన యమ నియమాసనాద్యంగములుగల మంత్రలయ హఠ రాజయోగములనెడు విద్యలు తెలుపవచ్చును, తానును తెలిసికొన వచ్చునుగాని యెంతటి మహాబుద్ధిమంతులకైనను ప్రజ్ఞానముచేతనైనా జీవేశ్వరైక్యమార్గమున శరీరత్రయమును జ్ఞానేంద్రియ కర్మేంద్రియము లను యడ్డగించి సంశయాత్మకమగు మనస్సును విజ్ఞాన స్వరూపముగా జేసి విదేహ కైవల్యమునందు నిల్పుట బహుదుస్తరము. యిందుకు సద్గురు కృపాకటాక్షముండవలెను. పద్యము॥ ఎక్కువ చదువులు చదివిన। జక్కనివాడైన రాజ చంద్రుండైనన్। మిక్కిలి రొక్కములివ్వక చిక్కదురా ముక్తికాంత సిద్ధము సుమతీ॥ అనుచేతనే సుమతీ యనుభవ వాక్యము ప్రమాణనిమిత్తము లిఖించవలసినది. ఇక నైదవ ప్రశ్నయైన మోక్షమనగా నేమో విచారింపబడు చున్నది. ఓ సోదరులారా! ఏకా గ్రచిత్తము గలవారలై వినగోరెద. ఇందులోనే చమత్కారమైన సం గతులున్నవి. దీని రహస్యమే యందరికిని గావలసియున్నది. ఇది తెలి యక బహుజనులు మోక్ష మరయలేకుండానున్నారు. తే॥ కొందఱా త్మ తత్వమునెఱుంగుదు మటంచు। గర్వులై నిక్కచిత్త నిగ్రహములేమి

నిజ సుఖంబుఁగానక విపుల విషయ । రాగలోలతఁ జెందరాక మహా త్మా॥ కొందరు తెలివి తక్కువగలవారు మోక్ష మెఱుంగుదుమని, యహంకరించి, మనస్సును జయింపలేమిచే చిత్తవిశ్రాంతి వలన గలిగిన యానందమును బొందనేరక నానావిధములైన యింద్రియార్థముల యందలి యభిలాషచే జనించిన సకలోపాసనలు, మంత్రములు మొదలగునవి చిత్తచాంచల్యముచే గలిగినవి గనుక వాటివలన నేవిధమైన ప్రయోజనములేదు, అనగా మోక్షముగలుగదు. మొదటి ప్రశ్న మోక్షమనగా నేమనిన. దాని నిపుడు విచారింప బడుచున్నది:— మోక్షమను పదమునకు మోక్షక్రియార్థము దెలియబడుచున్నది. మోక్షశబ్దమున కర్థమేమనగా ముచిల్ మోక్షణియను ధాతువ్యుత్పత్తిచే ముచిల్ యనగా ముచ్చుమానేము. అనగా విడుపని యర్థము సూచించినను, యావిడుపెటువంటిదో దాని క్రియాఫలము దెలియనందున లోకములోనే విడుపుకైనను మోక్షశబ్దము దృష్టాంతము గలదాయని విచారింపగా, "రాహుగ్రస్థ దివాకరేందు సదృశో మాయా సమాచ్ఛాదన" యనున్యాయమున సూర్యచంద్రగ్రహణములయందువిడువబడిన చంద్రునిని శుద్ధమోక్షమని జెప్పబడినదిగాని, మరెక్కడైనను మోక్షశబ్దము చెల్లబడదు. ద్రాష్టాంతికమునందా విడుపెటువంటిదో విచారించకుండా, కపటవేదాంతులు రాగద్వేషములువిడిచినయెడల మోక్షమనిన్ని, వాసనత్రయములు విడిచినపక్షమున మోక్షమనిన్ని, తాపత్రయములు వదిలినచో మోక్షమనిన్ని, యీషణత్రయములు వర్జించిన యెడల మోక్షమనిన్ని, అదిగాదు దిగంబరులై సంచరించినచో మోక్షమనిన్ని, అదిగాదు యన్నపానములు లేకయుంటే మోక్షమనిన్ని, యిదిగాదు యదెయనిన్ని, అదిగాదు యిదియనిన్ని, యెవరికిష్టము వచ్చినట్లు వారనుచున్నారేగాని విడిచిన తరువాతనున్న వస్తువేదో దానికి గదా, మోక్షముగావలెను. అయితే నిక్కడను విడిచిన వెనుక నున్న వస్తువేది? అది తెలియజాలక నూరకే వాదులాడుచు నున్నారు. సూర్యచంద్రుల

గ్రహణములు పట్టకమునుపు, పట్టినతరువాతను, విడిచినవెనుకను గ్రహ
ణమునకు కాలత్రయా బాధ్యముగా సూర్యచంద్రులుండుటచేత శుద్ధ
మోక్షశబ్దము యా సూర్యచంద్రులకే జెందబడియున్నదిగాని, లేనియె
డల శుద్ధమోక్షమనశబ్దము జెల్లనేరదు. మంచిది, యా విషయమునకు నీ
విషయమునకు దృష్టాంతదార్ష్టాంతికములు విచారించెదము. దృష్టాంతమం
దు రాహువును చంద్రుడును, దార్ష్టాంతికమందు జ్ఞానము నజ్ఞానము
ను, అక్కడచంద్రుని రాహువుగప్పబడియుండును. అక్కడను రాహువు
విడిచి పోగానే చంద్రునకుగాని, సూర్యునకుగాని, శుద్ధమోక్షమని
యందురుగాని, మరెప్పుడును మరెక్కడ ననరు. అయితే దార్ష్టాంతి
కమునందు యజ్ఞానముపోగానే యుండేది జ్ఞానమే. జ్ఞానము కాలత్రయా
బాధ్యమైనదే, అదే శుద్ధమోక్షము. దీపముపెట్టగానే చీకటిపోవునట్లు
యిక్కడను జ్ఞానమువస్తేనేగాని యజ్ఞానముపోదు. కాబట్టి "జ్ఞానదేవతు
కైవల్యమ్ జ్ఞానమేవమోక్షః జ్ఞానం త్రైలోక్యదుర్లభం విజ్ఞానం వినా
మోక్షోనసిధ్యతి జ్ఞానవిహీన స్సర్వమతేనము క్తిం నభజతి జన్మశతేన"
కాబట్టి, తన్నుతా దెలియకపోతె నెన్నిజన్మములకైనను మోక్షముగలు
గజాలదు. "జ్ఞానవిహీనః పశుభిస్సమానః" అని పెద్దలనెదరు. జ్ఞానములే
నిదే యెన్నివిద్యలు నేర్చిననేమి సార్థకములేదు. అయితె జ్ఞానమనగానే
మి? అజ్ఞానమనగానేమి? అంటే? జ్ఞానమనగా తన్నుతా దెలియుటే జ్ఞాన
మనబడునుగాని, తక్కిన విద్యలన్నియునేర్చి పండితుడనిపించుకొనునది
జ్ఞానముగాదు. అజ్ఞాన మనగా తన్నుతా దెలియకపోవుట యజ్ఞానమన
బడునుగాని, తక్కిన విద్యలు నేర్చుకొనక పోవుట యజ్ఞానముగాదు.
ఇకను తానెవరనగా, తాను సర్వము నెఱుగుచున్న తెలివి పంచప్రశ్నలు
విచారించినను తిరిగి యా తెలివివద్దకే వచ్చినాము. సర్వము నీతెలివే
గ్రహించుచున్నదిగాని యా తెలివిని దెలిసికొనే దేదియులేదు. ఇపుడీ
తెలివియొక్క యుత్పత్తి స్థితిలయములు తెలిసికొనవలయును. రోజు
నీతెలివివచ్చుచు, యుండుచు, పోవుచుండును. ఇట్లు ముగ్గడిగా తిరుగు

చుండును. ఈముగ్గడిలో నేమైనా తెలిసికొనేమార్గముండునేమో విచా
రించెదము. తెలివి వచ్చుచున్నప్పుడు దాని స్వరూపముదెలిసికొందా
మంటే యందరికి నీతెలివి వచ్చుచున్నది: అదేలాగున వచ్చుచున్న
దో యెవ్వరికిని దెలియబడదు. ఏమన, తెలివివచ్చేసరికి దేహరూపమై
పోవుచుండును. అసలు, యీ తెలివి లింగదేహమైయ్యేయున్నది.
(సూక్ష్మదేహము) దేహము తెలివిరెండు కలసియున్నప్పుడు దాని
రూపముదెలిసి కొందామంటే పాలునీరు కలసియున్నట్లు యీ రెండు
గలసియున్నవి. అప్పుడు తాను తెలివియనిన్ని మరితాను దేహేంద్రియ
ములుగాదనిన్ని దెలియబడుచున్నది. అంతకు మిక్కిలి దెలియబడకుం
డానున్నది. పోనీ, యిక నీతెలివి పోయినపుడు దానిరూపముదెలిసికొం
దామంటే, అసలు సర్వముగు త్తైరుగుచుండు తెలివే పోవుచున్నప్పుడు
మరిగ్రహించగల వస్తువేమున్నది? తక్కిన సన్నియు జడపదార్థములు,
యీ మూడుకాలములలో దెలిసికొనే మార్గము లేనట్టుగా కనబడు
చున్నది. ఇది విచారించినయెడల నింతికఠినముగానున్నది అయితే మం
చిది. యికను పెద్దల యనుభవము విచారించెదము. అందుకు, తే॥
తారకంబు మనశ్శుద్ధి కారకంబు। సాంఖ్యమాత్మ స్వరూప విచారకంబు।
అనుభవజ్ఞాన మమనస్క మట్లుగాన । నాద్యమెరిగింతు మొదలనీ వవ
ధరింపు॥ యిదేగదా యద్వైతులయనుభము. సరే, యిదే నిజమను
కొందాము. మనస్సే యమనస్క మగుచున్నది. యమనస్కమే
తిరిగి మనస్సగుచున్నది. ఆలాగున నీలాగునసైనది. మనస్సేనా? లేక
మరియొకటా? ఇక్కడను తప్పేమో యద్వైతులు తెలిసికోకుండా
నానందించుచున్నారు. అతప్పేమనగా, మనస్సు యమనస్కమై బ్ర
హ్మమైనది. తిరిగి యమనస్కము మనస్సగుచున్నది. అయితే బ్రహ్మ
మునకు సగుణత్వముగాని, భిన్నత్వముగాని, చలనత్వముగాని లేదుగ
దా? అమనస్కమైబ్రహ్మమైనమనస్సు తిరిగిమనస్సగుచున్నది. అయితే
నీమనస్సుబ్రహ్మమందైక్యముగా లేదని దెలియబడుచున్నది. ఈమనస్సే

వచ్చుచు పోవుచున్నదిగాని, బ్రహ్మము రాకపోకలు లేనిది. అటువ నట్టైనమనస్సు తిరిగి వచ్చుటచేతను అది బ్రహ్మమునందైక్యముకా లేదని తెలియవచ్చుచున్నది. ఇటువంటి తప్పు యద్వైతులు గ్రహిం చలేకుండా నానందించు చున్నారు. తే॥ కొందరాత్మ తత్వము నెఱుం గుదు మటంచు। గర్వితై నిక్కి చిత్త నిగ్రహములేమి। నుపరతిసుఖం బుగానక విపులవిషయ। రాగలోలత జెందు రూరకమహాత్మ॥ అన గా, కొందరజ్ఞానులు బ్రహ్మస్వరూప మెఱుంగుదుమని యహంకరించి మానసమును జయింపలేమిచే చిత్తవిశ్రాంతివలన గలిగినయానందమును పొందనేరక నానారూపములైన యింద్రియార్థమునందలి యభిలాషచే జనించిన చాంచల్యముచే నశింతురు. మఱియు నీలోకమున కల్లగురు వులు ముముక్షువులను ద్వైతములోని కేవలము దించి పాడుచేయు చున్నారు. శ్లో॥ ద్వైతమేవహి సర్వత్ర వదంతి ప్రలపంతిచ। సతుమ నుష్యాః కీటాశ్చ పతంగాః పశవశ్చతే॥ అనగా, తానువేరు, దేవుడు వేరను వారు మనుష్యులుగా నుండినను, వారుపశువులు పురుగులు మొదలగు వాటితో సమానులగుదురని సూతసంహితలో జెప్పబడి యున్నది. ఇకను యచల సాంప్రదాయకుల యనుభవము విచారించె దము. తత్పదత్వంపదములకుబదులుగా నెఱుకపరిపూర్ణములని పేరులు పెట్టి మార్చివేసి సర్వమునుగు ర్తెరుగుచున్న యెఱుకను మాయక్రిందను తీసివేసి యున్నది బ్రహ్మమనిరి. అయితె సరే, సర్వమును గ్రహించు చున్న యెఱుకను తీసివేసిన తరువాత నున్నది. బ్రహ్మమైతేనేమి? కాక పోతేనేమి? తానునే తెలివికి బ్రహ్మసిద్ధి కాకపోయిన పిమ్మట తా నెరుగ నదిన్ని తాగానిదిన్ని బ్రహ్మమైతే నేమి? కాకపోతే నేమి? క॥ తనలో నెప్పుడు నుండెడి। తనుదెలియగ లేకునిన్ను దరమా దెలియగ। దను దెలసుట నినుదెలసుట। సనకాదిమునిప్రసన్న సంపగిమన్నా॥ మఱియు నీ యచలసాంప్రదాయకులు యామానసా- మాయా- యని యెఱుకను మాయక్రింద లాగివేసినారు. ఇక్కడ నీ దోషమును దెలిసికోలేకుండా

సానందించుచున్నారు. ఇంకను వీరిలో పరిపూర్ణ లీగనబడుచున్న బయలే బ్రహ్మమని నమ్ముచున్నారు. సరే మంచిది, బయలే బ్రహ్మమని యొప్పుకొందాము. మరి నేననేదేది? ఈ బయలా? లేక బయలు ధర్మమా? మరి దీనికి దానికి సంబంధమెట్లు? నేననేది యెట్లు, యెప్పుడు దేహములోనికి వచ్చినది? మరి నేననేదాని ఉత్పత్తిస్థితిలయమెట్లు? అంటే? ఏమి జవాబు చెప్పలేకయుందురు. బియ్యముడకకుండా తినినచో యేమిప్రయోజనము? తనలోను ధర్మమర్మములు దెలియకుండా బయలు, బయలనిన్ని, యచలము, యచలమనిన్ని నోటమాటలు చిలుకపలుకులవలెనంటే నేమిసార్థకములేదు. బయలు స్వతసిద్ధముగా బ్రహ్మమయ్యే యున్నది. అది బ్రహ్మమైతే తనకు లాభమేమి? తనైనతెలివికి ప్రత్యక్షముగా కాలత్రయా బాధ్యముగా బ్రహ్మసిద్ధి పట్టినదని సహజముగా దెలిసియుండవలెను. ఇంట గెలిచి రచ్చ గెలియవలెను. తనలోను తాను తెలియకుండా పైదాని నెన్నిగ్రహించిన నేమిలాభము లేదు. బయలు బ్రహ్మమనుచు పలుమారు బలికేరు. బయలు బ్రహ్మమెట్లగును? బ్రహ్మమైన బయలు తానై యుండగయని వేమనగారన్నారు. మరియు నిందులో కొందరద్వైతు లేమన్నారనగా, శ్లో॥ చతుర్ముఖేంద్ర దేవేషు మనుష్యాశ్వ గవాదిషు। చైతన్యమేకం బ్రహ్మత్వం ప్రజ్ఞానం బ్రహ్మమయ్యపి॥ అనగా, సకలదేహములలో నీ చైతన్యమే యున్నది. ఈ చైతన్యమె సకల దోషాకారము. దాని మహాత్వము తెలియక పోబట్టికదా జనన మరణములు పొందడము సమస్తమైనవారు దీనినే బ్రహ్మమని నమ్మి దీనిలోనే యున్నారు. ఇదే బ్రహ్మకల్పన, బ్రహ్మాండములను బ్రహ్మలను సాలెపురుగువలె సకలముచేయును. దానికే వేదశాస్త్రపురాణములు ప్రమాణము. అన్నిభయభ్రాంతులుదానికే ఈ యెఱుక బ్రహ్మమైతే నీసగుణత్వ చలనత్వభిన్నత్వము లేమిటి? ఈయెఱుకధర్మములును బ్రహ్మధర్మములు నేకమేనా? కాబట్టి యెఱుకగూడా బ్రహ్మముకాకపోయెను. పెద్దలయనుభవముగూడా తప్పలుగా దోచు

చున్నవి. అన్ని సహేతుకరములగు దోషములు. ఎన్ని ప్రకారములు విచారించినను దోషములేవచ్చుచున్నవి. ఈ లోకములో నిట్లనే యను భవములేకుండా బ్రహ్మవిద్యను సాధించుచున్నారు. పద్యము॥ చదువు లన్నిచదివిచాలవివేకియై। మగుడితన్నెరుగక మందజనుడు। వ్యర్థచదువు చదివి వెఱ్ఱియై చెడిపోవు। విశ్వదాభిరామ వినురవేమా॥ ఎన్నివిధ ముల నాలోచించినను తెలివికిని బ్రహ్మమునకైక్యము సంభవించినది కాదు. ఏమన, తెలివి ధర్మములు సగుణము. బ్రహ్మధర్మములు నిర్గుణము దానిగుణములు దీనిగుణములు కేవల విరుద్ధముగా నుండుటచేత నైక్యపడదు గదా? మరి యద్వైతమనగా తానైన తెలివికిని బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు మూలమైన పరాశక్తి కధిష్టానమగు పరబ్రహ్మ మునకు నేకత్వము సహజమైయున్నదని తానైన తెలివికి ప్రత్యక్షాను భవము గానలెను గాని భావనవలన నెంతమాత్రము పనికిరాదు. అయితే నిట్లు తెలివి దేహమును రెండుమారుచున్నవి. ముందుమనము యసలురెండు వస్తువుల కెన్నిమార్పులుండు స్వభావమున్నదో విచారించెదము. ఏ రెండువస్తువుల కెన్నిమార్పులుండునో యీ తెలివి దేహములనెడి రెండువస్తువుల కన్నిమార్పులే యుండును. తెలివి దేహము రెండు కలసియున్నమార్పొకటి తెలివిపోయి దేహముండినమార్పు రెండవది. అన్నియు నీరెండు మార్పులే గదా? లేక నింకయేమయినను మార్పులున్నవా? అంటే యేమి గనబడుటలేదు. అయితే నింతేనా యనుభవము? ఈ లోకములో నిజా నిజములు దెలిసికొనలేకుండా "నందంటే నందిన్ని పందంటే పందిన్ని" యనెవరుగాని బ్రహ్మవిద్యకు లోతెంతో గ్రహించలేకుండా నున్నారు. ఎన్ని జపతపో యోగధారణాలుచేసినా, యెన్ని శాస్త్రములు చదివినా ఎంత మహానుభావులకైనా తన్నుతా తెలిసికొని సద్గురు కృపచే తన్నుతామరచుటే సర్వోత్తమము. ఎట్లనగా, నీ తెలివిచేత సమస్తమునెరిగి యీతెలివిని గురునాజ్ఞచె విడిస్తేసరి. ఏలాగుననగా, కాష్టము కాలబెట్టి యొక కట్టెతో

నెగయదోసి యా వెనుక యా కట్టెకుండా నందులో పడవేసినట్టు ఆలాగుననే యీ తెలివిచేత సమస్తము నెఱిగి యా తెలివినికూడా గురునాజ్ఞచే విడువవలెను. తెలివిదేహము రెండు కలసియున్న మార్పులో తెలివి స్వరూపము నెఱుగుదామంటే పాలునీరు కలసి యున్నట్టు కలసి పోయిన నది. తాను తెలివనిన్ని మరి తాను దేహేంద్రియ జీవులు గాదనిన్ని తెలియబడుచున్నది. అంతకు మిక్కిలి తెలియడము లేదు. పోనీ తెలివిపోయి దేహముండుమార్పులో నెఱుగుదామంటే అసలు సర్వము నెరుగుచుండు తెలివే పోవుచున్నప్పుడు మరి గ్రహించునదేమి యున్నది. తెలివికంటే వేరుగా నున్నవన్నియు జడపదార్థములగుటచే గ్రహించుకొనశక్తిలేదు. ఇదియునుంగాక గ్రహణమునందు సూర్యచంద్రులకు భూమి యడ్డు వచ్చినట్లు దేహము తెలివి యడ్డువచ్చుటచేత దానిస్వరూపము దెలియబడదు. ఎన్నిపర్యాయములైన నెఱుక మరపులు కలియడము, విడిచి పోవడము, సదా యీప్రకారముగా జరుగుచుండును. మీదజెప్పిన రెండు మార్పులలోను తెలివియొక్క స్వరూపము తెలిసేమార్గములేకుండాను దోషములే సంభవించుచున్నవి. మొదటనుంచి దోషములే కలుగుచున్నవి. ఈ రెండుమార్పులలోను మార్గములేదు. ఇకను మరియొక మార్పుంటేనేమో మార్గముండును గావోలు. ఆ మూడుమార్పులు ముందు రుజువుచూతము. అయితే రెండు వస్తువులకు మూడుమార్పులుండునేమో విచారించి చూతము తెలివి దేహము రెండు కలసియున్నమార్పులో నేమిదెలియదు. తెలివిపోయి దేహముండుమార్పులో యసలు తెలివిలేక పోవుచున్నది గనుక, నేమి తెలియదు. ఒక్క తెలివియుండి దేహములేని మార్పు గలిగిన యెడలను తెలివి స్వరూపము దెలిసి కొనుట కభ్యంతరముండదు. ఈ మూడవ మార్పుతో సకలదోషములు పోయినవి. ఈ మార్పునకే తుర్యమని పేరు. ఈ మార్పందరికి తెలియదు. దీని రహస్యము గురువుజెప్పితేగాని, తెలియదు. రాదు. ఈ తుర్యము వద్దకు సకల శ్రు

తులు ప్రమాణము. ఇక్కడనే తన్నుతా దెలియుట, అజ్ఞానధ్వంసము. లింగదేహభంగము. మోక్షశబ్దార్థక్రియానుభవము. పంచకోశవ్యతిరిక్తము. మూర్తిత్రయాతీతము, లోకత్రయాతీతము. అవస్థాత్రయాతీతము. నాలుగు మహా వాక్యముల లక్ష్యార్థము. ఆకాశ శరీరం బ్రహ్మ, ఏకమేవాద్వితీయం బ్రహ్మ, ఓం మిత్యేకాక్షరం బ్రహ్మ - ఇకను శంకరులవారి యనుభవము విచారించెదము. శ్లో॥ యదానంద రూపం ప్రకాశస్వరూపం। నిరస్తప్రపంచం పరిచ్ఛేద శూన్యం। అహం బ్రహ్మ వృత్త్యైక గమ్యం తురీయం పరబ్రహ్మనిత్యం తదేవాహమస్మి॥ శ్లో॥ నిషేధే కృతేనేతి నేతీతి వాక్యై। స్సమాధిస్థితం వై యదా భాతి పూర్ణం॥ అవస్థాత్రయాతీతమేకం తురీయం। పరంబ్రహ్మనిత్యం తదేవాహమస్మి॥ శ్లో॥ స్వరూపాను సంధాన రూపం స్తుతింయః। పఠేదాదరా ద్భక్తిభావో మనుష్యః॥ శ్రుణోతీహ వానిత్య ముద్యుక్త చిత్తో। భవేద్విష్ణు రత్రైవ వేదప్రమాణాత్॥ శ్లో॥ యదజ్ఞానతో భాతివిశ్వం సమస్తం। వినష్టంచసద్యో యదాత్మ ప్రభోధః॥ మనోవాగతీతం విశుద్ధం విముక్తం। పరంబ్రహ్మనిత్యం తదేవాహమస్మి॥ శ్లో॥ తపోయజ్ఞదానాదిభి శ్శుద్ధబుద్ధి ర్విరక్తో నృపాదౌ తయాతుచ్ఛబుద్ధ్యా॥ పరిత్యజ్యసర్వం యదాప్నోతి తత్వం। పరంబ్రహ్మనిత్యం తదేవాహమస్మి॥ శ్లో॥ నాహందేహో నేంద్రియాణ్యంత రంగో। నాహంకారః ప్రాణవర్గోనబుద్ధిః। దారాపత్యక్షేత్ర విత్తాదిదూర। స్సాక్షీనిత్యం ప్రత్యగాత్మా శ్శివోహం॥ ఇంతవరకు వైరాగ్య భక్తియోగములు మూడునుగలసి యాత్మసాక్షాత్కార సాధనమై బ్రహ్మసత్యం జగన్మిథ్యత్వములు తానైన తెలివికి ప్రత్యక్షానుభవమై యవస్థాత్రయసాక్షిత్వము నొందుటచేత తానుబ్రహ్మమని యానందించుటవలను తుర్యమున సచ్చిదానంద సహితమనగా, సత్తనగా బ్రహ్మమనిన్ని, చిత్తనగా తెలివనిన్ని, యీరెండు కలయుటచే యానందమగునదే సచ్చిదానందమనిన్ని చెప్పబడినది. శ్రుతి॥ జ్ఞానమానందగుంబ్రహ్మ ఇత్యుక్తం మూఢమానవై ః।

భ్రాంతిమూల మిదం జ్ఞానం జ్ఞానభ్రాంతిస్తునిశ్చితం । జ్ఞానాత్సంజాయతే నందః మానంద భ్రాంతిలక్షణం । సత్యజ్ఞాన మనంతంచ మాయాగుణ మితిశృణు॥ అని శ్రుతి స్మృతులచేత చెప్పబడి యున్నది. లోకములో కొందరు జ్ఞానులు తుర్యానుభవమే మోక్షక్రియయైన విదేహకైవల్యమని సంతోషించుచున్నారు. అక్కడదోషమేమో గ్రహించుకొనలేకుండానున్నారు. తుర్యమున సర్వసాక్షియైన తాను బ్రహ్మమని యానందించునది తెలివిగాని, బ్రహ్మ మెంతమాత్రముగాదు. కారణమేమనగా, శుద్ధ బ్రహ్మమునకు జ్ఞానాజ్ఞానములు, జడాజడములు, ఆత్మానాత్మలు, ప్రకృతిపురుషులు, ఉపాధిద్వయములు మొదలగు ద్వంద్వములులేవు. ఆ తుర్యమే బ్రహ్మమని యొప్పుకొన్న పక్షమున తుర్యమందు సాక్షిత్వము తుర్యాతీతమున పోవుచున్నది గావున, సాక్షిమాయలకు భేదములేదు. ఈ శరీరమునందు అన్నమయ, ప్రాణమయ, మనోమయ కోశములనుదాటి విజ్ఞానమయ కోశమునకు జేరె నపుడు తేజోరూపమైన బ్రహ్మాండమునిండి బట్టబయలై యఖండముగా ప్రకాశించుటవలన తనకు దేహప్రపంచములులేక సర్వసాక్షిత్వమున బ్రహ్మమై తన మహాత్స్వరూపము జూచి తానే యానందించుట వలన నది సచ్చిదానందమనిజెప్పబడును. ఇట్టి యనుభవముగలవానికి శా॥ వైరాగ్యంబు దృఢంబుజేసి పరతత్వజ్ఞాన మార్జించి స। ర్వారంభోపరమంబుగై కొని తురీయంబంది యీరీతియో । గారూఢుండగు వానికిం గలుగునే యాగామియు స్సంచిత। ప్రారబ్ధంబులు సంతతంబును బరబ్రహ్మాత్ముడై యుండగా॥ ఇటువంటివాడు॥ సీ॥ ఏదేశముననైన నే కాలముననైన నేమిసేయుచునైన నెట్టులైన । సకలవికారంబు లావిద్యకంబులు నేంవికాదుండ నిష్ప్రపంచ । నిర్వికల్పాఖండ నిశ్చల నిర్మలావ్యయసచ్చిదానంద మహానిరీహ । పరిపూర్ణనిర్గుణ ప్రత్యగాత్మాభిన్న పరమాత్ముండ నటంచుఁ బరమనిష్ఠ॥ తే॥ సంతతంబును దనుఁగాంచు సజ్జనునకు । మంత్ర తంత్రంబులేల కర్మంబులేల । జపతపోవ్రతదాన

యజ్ఞంబులేల । నామవర్ణాశ్రమాభిమానంబులేల॥ ఇటువంటి తుర్యా నుభవమునుగల జీవన్ముక్తు డెక్కడ నేవిధముగానున్న నేమి? అందుకు ప్రమాణము॥ శా॥ ఏవేళ భువి నెచ్చోట మతియే యేబాధలం బొం దుచున్ । జీవన్ముక్తుడు దేహము న్విడిచినన్ సిద్ధం బనాద్యంతమున్। భావాతీతము పరబ్రహ్మాత్మకంబైనయా । కైవల్యంబునుబొందు సత్య మనహంకారాత్మ తత్వాత్మకా॥ ఈ ఆయును తుర్యానుభవమునందు తెలివి, తేజస్సు, బయలు మూడు నేకమైయుండుటచేతను సచ్చిదానంద బ్రహ్మమై తరువాతను తానైన తెలివి లీనమై సాక్షిత్వము లేనం దున సదసదానందస్వరూపమైన తుర్యాతీతమే కొందఱుజ్ఞానులు బ్రహ్మ మని యానందించుచున్నారు. ఇక్కడను దోషమేమనగా, తుర్యమే తుర్యాతీతమగుచున్నది. తిరిగి నాతుర్యాతీతమే తుర్యమగుచున్నది. సుషుప్తి జాగ్రతలవలెనే తుర్యతుర్యాతీతములగుచున్నవి. ఇట్లు పంచా వస్థలలోనే ఈ తెలివి సంచరించుచున్నది, పంచావస్థలలో సంచరించు చున్నది. శుద్ధబ్రహ్మముగాను, పంచావస్థలు మీరినది శుద్ధబ్రహ్మము ఇదే సర్వకాల సర్వదేశ సకల పదార్థములయందు నిండి నిబిడీకృతమై యున్న పరిపూర్ణ బ్రహ్మము ఇది నద్దనే యున్నది, గుద్దుకున్నా తెలి యదు. అయితే సగుణమే నిర్గుణ మగుచున్నది, నిర్గుణమే తిరిగి సగుణ మగుచున్నది. శుద్ధబ్రహ్మము సగుణ నిర్గుణములకు సాక్షి స్వరూపము. ఇందుకు శ్రీమద్దక్షిణామూర్తి స్వాములవారి యనుభవ వాక్యము వినవలెను. శ్లో॥ సాకారంచ నిరాకారం నిర్గుణంచ గుణా త్మకం । తత్వం తత్పరమం బ్రహ్మ ఇతివేదాంతడిండిమః॥ శ్లో॥ అవి ద్యోపాధికోజీవో మాయోపాధిక ఈశ్వరః । మాయావిద్యా గుణా తీత యితి వేదాంతడిండిమః॥ ఆ॥ ఏమిగానిదాని నెఱుగుట లక్ష్యంబు। సాముచేసినట్లుసాధ్యపరచి। సీమనిష్ఠనదిలోనిర్గుణమందరా॥ వి॥ తే॥ సగుణ నిర్గుణమనియెడి సంశయంబు। పరమగురునాజ్ఞచేగాకపట్టువిడదు। అగణి తంబుగమదిలోన నందవలెను। విమలగుణరాజయోగీంద్ర వేమనార్యా॥

పద్యము॥ శుకయోగీంద్రుడు తనలో। ప్రకటితము పూర్ణమంది బ్రహ్మ
న్విత్తుడై । యకలంకభావపరుడై నికరంబుగ వెలయుచుండె నిజముగ
వేమా॥ తే॥ సర్వకులధర్మమర్మముల్ సంతరించి। సకల యోగంబులను
మించి సత్యముగను । బట్టబయలందుజేరుటే బ్రహ్మవిద్య॥ విశ్వ॥ తే॥
హరిహరాదులకైన నయ్యాత్మ విద్య । గురుకటాక్షము బొందక నెఱుక
పడదు । పరమ పరిపూర్ణ భావంబు బయలుగాదె॥ వి॥ అంతా బ్రహ్మ
మయంబని । మంతిననుగు మోహమునను మర్మము గిసినక । వింతలు
బయలున నున్నగు। చింతలువిడిచెట్టినాడె సిద్ధుడువేమా? ఇటువంటి నిజ
మును గ్రహించుకోకుండా యతిసూక్ష్మముగా బయలని నోటను చిలుక
పలుకులవలె ననుభవము తెలియకుండా పామరులనెదరు. ధార్మికులకు
గాని ధర్మంబు తెలియదు । కష్టజీవికెట్లు గానబడును? । నీరు పొంక
లోతు నిజముగా తెలియదు॥ విశ్వ॥ ఆవరణబోధకు సాధనలు యుపా
సనలు మొదలయినవి గానలసియున్నవిగాని నిరావరణబోధకు సాధనము
లక్కరలేదు. పలవనగా కనబడే చిత్రములకు గిట్టక్క చూడవలెనా?
ముంజేతి కంకణమున కద్దము గావలెనా? సాధనాంతర నిరపేక్షమయిన
పరిపూర్ణ బ్రహ్మము సాధనలచే లభ్యముకాదు. శ్రుతి;—— సాధనాం
తర నిరపేక్ష సర్వగతా పరిచ్ఛిన్న శివ ఏకోనశిష్యతే॥ యీలాగున శృతి
చెప్పియున్నది గనుక, నేసాధన జరూరులేదు. శ్లో॥ గురుర్ముఖేన జ్ఞాత
వ్యం నాన్యథా గ్రంథకోటిభిః । అన్యథా లభితం నాస్తి సత్యం సత్యం
పునఃపునః॥ పరిపూర్ణ బ్రహ్మము నే ప్రకారముగా ధ్యానముచేయవలె
నంటే? శ్లో॥ యథా చర్మవదాకాశం వేష్టయిష్యతి మానవం । తథా
పరశివం జ్ఞాత్వా సముక్తో నాత్రసంశయః॥ కలలో మేలుకొంటే నేమి
లేనట్లు శ్రుతి;—— సర్వద్వంద్వ వినిర్ముక్తం సర్వానంద మయఃపరః ।
సర్వానుభవ వినిర్ముక్తం సర్వా భావవర్జితం । ఆత్మానాత్మా వివేకాది
భేదా భేద వివర్జితం । మహావాక్యార్థతో దూరః అహమస్మీతివర్జితః।
క్షరాక్షర విహీనేన ఉపాధి ద్వయహీనతః॥ బాధ్యాబాధ్య విహీనత్వం

బోధ్యాబోధక వర్జితం । దేశకాలాదిభిః శూన్యం సర్వశూన్యం సనాతనం॥ అనియున్నది. ఇటువంటి పరిపూర్ణాచల సమాధియందున్నవారు సంసారములో నెట్లుందురనగా, సీ॥ జలజపత్రమునందు సలిల మంటని యట్లు నద్దమందునరూప మంటనట్లు। మరదయాకున పురుగు అంటని యట్లు నాజ్యంబు జంహాయం దంటనట్లు । భువి చింతపండుపై బొబ్బ రింటనియట్లు బలుచల్లలో వెన్న గలయనట్లు । బ్రహ్మవేత్తలు మాయా ప్రపంచమందు । నఖిల వ్యవహారములుజేసి యంటరదిప । రమ్యగుణ ధామ భద్రాద్రిరామసత్య । కామ కరుణాలలామ లోకాభిరామ॥ సీ॥ వేదముల్ వివరించి విననేర్చుకోలేదు శాస్త్రపురాణముల్ చదువలేదు । యాంధ్రగీర్వాణంబు లభ్యసించగలేదు వేదాంతమార్గముల్ వెదుక లేదు । చూచిఛందంబులు శోధించగాలేదు సాధుజనులపొందు సలుప లేదు । విలసత్తలంకార విధము చూడగలేదు కావ్యనాటకములు గాన లేదు । సద్గురుకటాక్షంబు నామీద మిగుల గలుగ । జేయబూనితి నీ సుబోధ । తప్పులేకుండ దయజేసి ధరణియందు । కవిజనంబులు మెచ్చ విఖ్యాతిజేయు॥ రమ్య॥ సీ॥ సకలదేశములందు సకలవస్తువులందు చలన లేకనె బ్రహ్మముండియుండు । చావు పుట్టుకలేక యీ శుద్ధబ్రహ్మమేకాని రెండోది లేదులేదు। కలలోను గనుగొన్న గజము మేల్కొనిచూడ లేశ మైనను యేమి లేనిభంగి । భ్రమయుక్తమయిన మూలములేని గురుతె లిగే శరీరమేమిలేదు। యిది గురువాక్యపద్ధతి విదితముగను। విమర్శించిన వాడు వివేకపురుషు । రమ్యగుణధామ భద్రాద్రిరామసత్య। కామ కరుణాలలామ లోకాభిరామ॥ సీ॥ అలచతుర్వేద మహావాక్యములయందు నీవె బ్రహ్మవు బ్రహ్మనీవె యనుచు । యుపనిషద్భాష్యంబు లూహించి వెదకిన నీవె బ్రహ్మవుబ్రహ్మ నీవె యనుచు। యోగశాస్త్రములలో యుక్తి సాధించిన నీవెబ్రహ్మవుబ్రహ్మ నీవెయనుచు । మంత్రశాస్త్రంబుల మర్మ ముల్ దెలిసిన నీవె బ్రహ్మవుబ్రహ్మ నీవెయనుచు। వేదవేదాంత వేత్తలెల్ల। నిశ్చయింతురు నిత్యంబు నిగమవినుత॥ రమ్య॥ సీ॥ ఈ శుద్ధబ్రహ్మం బేమి

లేకను స్వతాపరిపూర్ణమైయుండు ప్రకృతిలేదు। కలలోనుగనుగొన్న గజ
మేమిలేనట్లు మెలఁగేశరీరమేమిలేదు। యిదిగురువాక్య మింతకంటె నెక్కు
వైనవాక్యంబు యొండైనలేదు। యిదిరాజమార్గము యిదియ నాయా
సంబయినది భ్రాంతి రహితంబు యిసుస్థిరంబు। యిది నమ్మినవారి కేమి
బాధ। లేదుజన్మంబు మరణంబు లేదులేదు॥ రమ్య॥ ఉ॥ అచ్చపు చీక
టిం బడి గృహవ్రతులై విషయ ప్రమత్తులై। చచ్చుచు బుట్టుచు న్న
రల జర్విత చర్వణులైన వారికిం। జెచ్చర బుట్టునే పరులు సెప్పిననైన
నిజేచ్ఛనైననే। మిచ్చిననైన గానలకు నేగిననైన హరి ప్రబోధముల్॥
గీ॥ అతిరహస్యమైన హరిజన్మ కథనంబు। మనుజుడెవ్వడేని మాపు
రేపు। జాలభక్తితోడ జదివిన సంసార దుఃఖరాసిబాసి తొలగిపోవు॥
చ॥ జననములేక గర్మముల జాడల బోక సమస్త చిత్తవ। ర్తనుడగు
చక్రికిన్ గవులు దార పరంబుల జన్మకర్మముల్। వినుతులు సేయుచుం
దుదురు వేదరహస్యములందు నెందు జూ। చిన మరిలేవు జీవునికి జెప్పిన
కైవడి జన్మకర్మముల్॥ భాగవతము॥ కాబట్టి యో ప్రియసహోద
రులారా! ఉ॥ ఏనుమృతుండనౌదునని యెంత భయంబు మనంబులో
పల। న్మానము సంభవంబుగల మానవకోట్లకు జావు నిత్యమా। గాన
హరిం దలంపుమిక గల్గదు జన్మము మీకుధాత్రిపై। మానవులు బొం
దెదరు మాధవలోక నివాస సౌఖ్యముల్॥ ఓ సోదరులారా! ఈ స్వాను
భవబోధిని యున్నదున్నట్టుగా వ్రాయబడినదిగాని, లేనిదున్నట్టుగాను,
యున్నది లేనట్టుగాను, లిఖించడములేదు. అయితే నీ పరమపురుషార్థ
పంచప్రశ్నోత్తరముల నొక్కమారు చదివినంత మాత్రముచేత మనుజు
లకు సమస్త పాపములను నశించి సద్యోముక్తి శీఘ్రుంబున లభించును.
మనుజులు జననమరణములులేని యాత్మను దెలియంజాలక శరీర నాశ
నమునే నశించితిని. దిక్కులేనివాడైతినని రోదనముజేయుచున్నారు.
ఆ॥ ఆదినెట్టుగలేని యట్లుండు తామరి। జెప్పలేదుగాని తప్పబట్టు।
తోయనేర్చుకుక్క దొంతుల బేర్చునా॥ వి॥ నవతికంచములో పురీషము

బెట్టి తినినమొసల దాని నోరెచెడి కంచముచెడనట్లు యీ స్వానుభవ బోధను దూషించువాని నోరులే చెడునుగాని, యీ బోధకేమి హాని రాదు. కాబట్టి మోక్షాపేక్షబుట్టువారలారా! ఈ లోకములో నున్నదున్న ట్లువారె స్నేహముజేసి గ్రహించుకొనుటకంటె నెక్కువేదియులేదు, ఇది స్వానుభవ సిద్ధాంతము. అరచేతిలో వైకుంఠమున్నది, అది యందర కును దెలియదు. గురుకృప బొందినవారికి సులభముగా దెలియును. చరమశ్లోకము॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ। అహం త్వాం సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచ॥ అని శ్రీకృష్ణభగ వానులవారు అర్జునితో ప్రతిజ్ఞచేసిచెప్పినారని భగవద్గీతలలో నున్నది. దాని తాత్పర్యమేమనగా, సమస్తములైన ధర్మాధర్మములు, జననమర ణములు, స్వర్గనరకములు, పుణ్యపాపములు, న్యాయాన్యాయములు, సంకల్ప వికల్పములుగల మెఱుక యనెడి యహంకారమును సమూల ముగా నాచార్యుని కటాక్షముచేత విడిపించుకొనుము. అహంకారము లేని నేను యహంకారుడవైన నిన్ను సర్వపాపములనుండి విడిపించ గలను. నీవుమాత్రము లేక పోవుచున్నానని దుఃఖపడకుమా, గీతా భాష్యములో నీ యుత్తపరిపూర్ణమే యున్నదని శంకరాచార్యులవారు చెప్పియున్నారు. సూత్రభాష్యమందును బుట్టని చావని యీ పరి పూర్ణమే యున్నదని వ్యాసులవారు జెప్పియున్నారు. ఉపనిషద్వాక్య ములయందును పుట్టని చావనివాడే పరబ్రహ్మమని, యమృతమని, కార్యకారణములు లేకనున్నదని, సదసత్తులుగానిదని యున్నది. గనుక పరిపూర్ణమే బుట్టని చావనది. ఇదే సకల మహాపురుషులయనుభవము ఇంతకు మిక్కిలి మరెక్కడ ననుభవములేదు. బసవేశ్వర ప్రభువుల మార్గమేదనగా, ద్విపద॥ రవ్వియై యా బ్రహ్మరంధ్రంబు వెడలి - యువ్వలబైట శివైక్యంబునొంది - సాకారమందున నిరాకారమూను - నిరాకారమందున సాకారమూను- ఏకమై యెప్పుడు యెడబాయకుండ - యాకల దెలసిననా రెంటినడుమ-నైక్యమౌత్యంబునగలరుచునుండు॥ కృష్ణ

వాక్యము॥ ఉత్తరగీత॥ ఖలమధ్యేకురుచాత్మాన మాత్మమధ్యేచఖంకురు। ఆత్మానఖంమయంకృత్వానకించిదపచింతయేత్॥ ఆకాశమాన సంకృత్వా మనఃకృత్వా నిరామయం। నిశ్చలంతం విజానియ్యా త్యముక్తో నాత్ర సంశయః॥ ఈలాగున నుత్తరగీతలయందు యర్జునునికి కృష్ణమూర్తి బోధించెను. ఇది తెలసినయర్థము శివరామదీక్షితులవారు యేర్పరచిన రాజమార్గము. అశరీరం సర్వదానాస్తి శరీర రహితంసదా। ఇయమేవ సదాముక్తి రన్యదా భ్రమకారిణం॥ కొండలు బోధ నిమిత్తము శ్రుతి స్మృతులచేత నారోపించి తిరిగి లేకుండా చెప్పనురు. అలాగు చెప్ప కూడదు. ఆకాశపుష్పము మొదట నారోపించి తిరిగి లేదని చెప్పకుంటే మొదటే లేదని చెప్పరాదా? స్వబుద్ధ్యా బావిలోపడి లేవతియ్యమని యేడవడమేమి? రాయిగుద్దనేలా? చేయి నొప్పించునేలా? బురదలో కాలుపెట్టి కడిగికుంటే నూరకోవడ మత్తమము కాద? వంధ్యా పుత్రుడు పుట్టినాడనిన్ని పెరిగి భార్యాపుత్రాదులతోనున్నాడనిన్ని చెప్పకుంటే లేనిదాని మచ్చట తలచక పోవడమే యుత్తమముకాదా? లేనిది వున్నదని యారోపించి తిరిగి లేదనుటకు శ్రవణమనన నిదిధ్యాసలెందుకు? తానసగా వంధ్యాపుత్రుని వంటివాడని శ్రుతి స్మృతులున్న పెద్దలైనవారున్ను చెప్పచున్నారు. మరియును సనకాదుల కందని మార్గము శిశువు చెప్పెను. అదేమన, శ్లో॥ చిత్రవట తరోర్మూలే వృద్ధ శిష్యా గురుర్యువా। గురోస్తుమానం వ్యాఖ్యా శిష్యాస్తు ఛిన్నసంశయః॥ ఆలాగే యవాఙ్మానస గోచరమైన పరవస్తువు ఎఱుకలేక తెలిసి నచో యేమిలేదు, ఉన్నదే పరిపూర్ణాచల బ్రహ్మము చెప్పడమునకేమి లేదు, అనుభవక్రియవలన తెలుసుకోనవలెను. వేదములెఱుకకే ప్రమాణములు. ఎంతచెప్పిన నెఱుకకే ఎఱుక దేహము నొక్కటే: దృక్కే యెరుక అదేజగదాధారము. అదియున్నంతసేపుయన్నియున్నవి, దేహము లేకుంటే యాత్మలేదు. ఆత్మలేకుంటే దేహములేదు. గనుక రెండు నొకటే అదేలాగనగా, చంద్రచంద్రికవత్ కనకభూషణవత్ ఇందుకు

లీలావాక్యము "తనుకరణాదులాత్మవిగాక" యున్న ఘటపటాదులవలె కడనుండుగాన పైబుద్ధిచే వాని పరిహరింపగవలె నన్నయర్థంబు వ్యర్థంబుగాదె తానుమిథ్యయున్న తనుకరణాదులార మహాత్ములా మహాత్మునంటినా ప్రభురాయా అనిన్ని, సిద్ధాంతకారులైన దీక్షితుల వారన్న మాట దేహము తాను వేరైతే తాను భోజనము చెయ్యవలెగాని దేహము భోజనమేలాగు చేసును? స్నాన సంధ్యలు తానే చెయ్యవలెగాని దేహమెట్లు చేయనలెను? అందుచేతను దేహమునకు తనకు లేశమైనా భేదములేదు. శ్రుతి;— కార్యకారణో ర్భేదో నాస్తిసర్వం బ్రహ్మమేవ సనాతనం॥ సత్యం॥ యీలాగు చెప్పియున్నది. గనుక కారణమయిన యాత్మకును కార్యమయిన దేహేంద్రియాదులకు భేదములేదు. జలమువలన బుట్టిన బుద్బుదములు జలముకంటె నేలాగు భిన్నముకావో యీలాగు నాత్మవలన పుట్టిన దేహేంద్రియాదులు భిన్నము కావు. ఇందుకు సందేహములేదు గనుక, యో సహోదరులారా! ఏకాగ్రచిత్తము గలవారలై యాకర్ణించవలె. సీ॥ సగుణ నిర్గుణములు సదసత్తులును నిరాకారసాకారముల్ గానిదేదొ। క్షేత్రజ్ఞ క్షేత్రముల్ జీవజగంబులు కారణ కార్యముల్ గానిదేదొ। పాప పుణ్యంబులు బంధమోక్షంబులు జ్ఞాన కర్తంబులు గానిదేదొ। క్షరమక్షరంబులు సత్య మసత్యముల్ ఖండ మఖండముల్ గానిదేదొ। రాక పోకలు జెప్పగ రానిదేదొ। సదియు కేవల పరిపూర్ణ మనగనొప్పు। గమ్య గుణధామ భద్రాద్రిరామసత్య। కామకరుణాలలామ లోకాభిరాము॥ శుకులు, నారదును, సనకసనందాదులు, వ్యాసులు, పరాశర, సూతులు, జనక, సాందీప, శివరామదీక్షితులు, దక్షిణామూర్తిస్వాములు, విద్యారణ్యస్వాములు, వేమన, వార్థికులవారు, వసిష్ఠులు మొదలగు సకలమైన మహానుభావుల యనుభవ మిదియే గాని మరివేరులేదు. ఈ లోకమునందున్న దున్నట్టుగా తెలసి కొనలేకుండా నున్నది లేనట్టుగాను, లేనిదున్నట్టుగాను గృహస్థులకుపదేసించి వారిని పాడుచేయుచు

న్నారు. గీ॥ శుష్క వేదాంత సిద్ధాంత సూటిపరులు । ఆత్మ నెఱుంగక యర్థముల్ వ్యర్థముగను । జెప్పచుందురు లోకులఁ జెరుచుకొఱకు । నిజము నిష్ఠూరమై కల్లనిజములాయె॥ ఓ సహోదరులారా! మీరు మాయావాదుల బోధ వినక యున్నదున్నట్టుగానున్న యీ స్వానుభవ మోక్షబోధిని నిత్యము సత్యముగా పారాయణ జేసిన యెడల శాశ్వత బ్రహ్మప్రాప్తిగలుగుటకు సందియములేదు, యిది గురువాక్యము, యిదే వేదాంతము. యింతకన్న యధికము మరిలేదు. అచ్యుతానంతగోవిందా నామోచ్చారణ భేషజం । నశ్యంతి సకలాన్ రోగాన్ సత్యం సత్యం వదామ్యహం॥ అని ధన్వంతిరి వాక్యము పాండవగీతలో వ్రాయబడి యున్నట్టు లేనిదున్నట్టుగానున్న, యున్నది లేనట్టుగానున్న, జేయుచున్నదంతయు భేషజమే. అది లేకుండ, క॥ ఎన్ని విధంబులనైనను। నున్నది యున్నట్టేకన్న యోగులసేవన్। తన్నే తా నెరుగకపో। దన్నా మాయా ప్రపంచమంతయుదానై॥ మూలములేని యీ గుర్తెరిగే శరీరము ప్రతి దినమం దేమిలేదు. అందరికి శంకరాచార్యులు చేసిన యద్వైతమం దాశగలదు. అద్వైతమే గుర్తెరిగేసాక్షిణి మాయయని యెంతవారికి సూచనగాదు. మాయ యనగా లేనిది. అద్వైతము వాదముకొరకే గాని భ్రాంతి రహితముగాదు. అద్వైతమనగా తనకు తానే స్వతసిద్ధమయి చెలించక యున్నదానియం దేది లేనిదో యదే యద్వైతమని భావార్థమున్నది. శరీరము సార్వకాలము తీసివేసే గురువు దొరుకుట బహుదుర్లభము. ఈ మహాగుహ్యము మహారహస్యము యీ మార్గమనేకకోట్లలో నొక్కడు దెలిసినవాడుండునేమో? యీ శరీరముతో నేది చేసినను పాపమే. కలలోవచ్చిన యేనుగుయొక్క దంతముల కాశబడితే మేలుకొంటే నేమిలేదు. కలలో వచ్చిన శరీరము కొంతసేపుండి కొంతపోయినదే మేలుకొంటె నేమిలేదు. అలాగే మూలములేని యీ గుర్తెరిగే శరీర మేమిలేదని గురువాక్యముచేత మేలుకొంటె నేమిలేదు. శంకరాచార్యులు దేహాది పదార్థములను గుర్తెరిగే క్షేత్రజ్ఞ స్వరూప

మనే పరాప్రకృతిని యాత్మని యబద్ధమాడి యీయాత్మ పరబ్రహ్మ స్వరూపమని యన్నారు. అయమాత్మా బ్రహ్మమనే యబద్ధప్రకృతి ముందర బెట్టినారు. ఆ యబద్ధమేమో విచారించెదము. గుర్తెరిగే క్షేత్రజ్ఞ స్వరూపమే పరబ్రహ్మమైతే క్షేత్రమెందుకు పరబ్రహ్మ స్వరూపము కాదు? బ్రహ్మ జగత్కారణము గనుక క్షేత్రజ్ఞ స్వరూపమైన యాత్మకు బ్రహ్మకు వేరుగానట్టే బ్రహ్మకార్యమైన క్షేత్రమునకు వేరు లేదు. సర్వము బ్రహ్మస్వరూపమే కార్యకారణముల కెన్నటికి భేదము లేదు. బ్రహ్మసత్యం జగన్మిథ్యని యెందుకనవలె? సర్వము గుర్తెరిగే బ్రహ్మస్వరూపమే గుర్తెరిగే శరీర చైతన్యమనే జ్ఞానస్వరూపము నిబద్ధ కర్మములబద్ధమని యెందుకనవలె? దేహాది పదార్థములను గుర్తెరిగే బ్రహ్మస్వరూపరూపము శాశ్వతమైనది. దేహముల సత్తుయేమి లేదని యెందుకనవలె? రెండోదేమిలేదు యవిద్యని యెందుకనవలె? ప్రకృతి కంటె పరమని యెందుకనవలె? శుక్తియందు రజితముతోచినట్టు తోచినదని యెందుకనవలె? ఒకటున్నది ఒకటిలేదని యెందుకనవలె? శంకరాచార్యులవారు జ్ఞానము నిజము కర్మములు నిజముకావు. గుర్తెరిగే జ్ఞానమున్నంతవరకు కర్మలు వదలనేవదలవు. ఆచార్యస్వాములవారు మహా చదువుకున్నవారేగాని వారి మార్గ మబద్ధాల మార్గమని చాకలవాడొప్పపోయె? ఛీ! యీ గుర్తెరిగే జ్ఞానమున్నంతమట్టుకు కర్మలు పోనే పోవని మంగలవాడొప్పక సంతోషపడకపోయె. జగత్తుకు కారణమున్నదన్నవాని పాప మెవనికిలేదు. జ్ఞానము బోధించినవాడు గురువుకాడు. భక్తివైరాగ్యములను బోధించువాడు గురువు కాడు. దేవతాభ్రాంతి, శ్రవణ, మనన, నిధిధ్యాసలు బోధించువాడు గురువుకాడు. ఎన్ని వ్రాతు జన్మభ్రాంతి లేకుండజేసినవాడే గురుడు. ఉన్నదున్నట్టు తెలిసినవాడే సద్గురుడు. పద్యము॥ పుట్టుచావును రెంటికి బొరయనట్టి । నిర్మల జ్ఞాన సంపూర్ణ నిష్టగలుగు । తెరువు గనిపించు నాతడే గురువరుండు॥ పద్యము॥ బట్టబయలైన యీ పరబ్రహ్మమహిమ । దేశికస్వామి కృప

లేక తెలియరాదు । ఎన్ని చదువులు చదివిన నేమిఫలము? సంసార మనగా మూలములేని యీగుర్తెరిగే శరీర మేవిచేసిన నదే సంసార మనబడును. ఈ శరీరము పలాని దాని వలన వచ్చినదని ప్రమాణము లేదు. యీ శరీరమునకు మొదలేమిలేదు. మొదలుంటే ప్రమాణమే యుండును. ఈ శరీర మేమిలేదని నిశ్చయముగలవాడే పరిపూర్ణుడు. మూలములేని యీగుర్తెరిగే శరీర మావరణమువలె నున్నది. యీ యావరణ వేసేవారే గాని తీసే గురువు దొరుకుట బహుదుర్లభము. ఉన్నదున్నట్టుగా విచారించినవారు మహాదొడ్డవారు. లేనిదున్నదని యున్నదిలేదని బోధించిన గురువులు చాలమంది దొరుకుతారు. దొంగ గురువులకు లెక్కలేదు. శ్లో॥ సర్వశూన్యం మయూహపం జన్మశూన్యం స్వభావతః॥ స్వప్నములో శరీరము మేలుకొంటె నేలాగో యీలాగే మూలములేని యీగుర్తెరిగే శరీరమేమిలేదు. అందుకే పుట్టని చావ నిది మొదలు తుదలు లేనిది సకల దేశములయందును, సర్వకాలముల యందును, సమస్తవస్తువులయందును, చలించక సర్వకాలము నొక్క తీరుగానేయున్నది. ఈ దేహమీలాగు వచ్చినదనగా, కలలో దేహము లెక్కడనుండి వచ్చినవియో యీలాగునే తనకు తానే వచ్చి తనకు తానేయున్నది. సమస్తమైన వ్యవహారములుచేయుచు మేలుకొంటే నేమి లేదు అదినిబద్ధే. ఆలాగున నీమూలములేని గుర్తెరిగే శరీరమేమిలేదు. ఇదే నిజగురుసాంప్రదాయము. శ్లో॥ అశరీరం సర్వదానాస్తి శరీరరహితం సదా । ఇహమేవ సద్యోముక్తి అన్యథా భ్రమకారణం॥ మూలములేని యీగుర్తెరిగేశరీరము రాకమునుపు పరమాత్మేయున్నది. యున్నపుడు పరమాత్మేయున్నది. పోయినపుడు పరమాత్మేయుండును. భ్రాంతిలేని గురువు దుర్లభము. ఆయన యందరివలెనేయుంటాడు. మూలములేని యీగుర్తెరిగే శరీరముచేసిన శంకరభాష్యాదులు మిక్కిలి నమ్మినారు. సమస్తశాస్త్రములు యెరుకకే ప్రమాణములుగాని పరిపూర్ణ బ్రహ్మము నకు ప్రమాణములుగావు. అహంకారము లేకపోవడమే ముక్తి అహం

కారము జ్ఞానమొక్కటియే అహంకారము లేకపోవుటే పరమ పదము. జీవేశ్వరులే ప్రకృతిపురుషులు. యీరెండే సగుణ నిర్గుణములు, విద్యావిద్యలు, సుఖదుఃఖములు, జడాజడములు, సదసత్తులు, యీరెండే సకలమైన యజ్ఞయాగములు, యోగములు, యాత్రలు, సకలచదువులు, సకలనీమనిష్టలు, బ్రహ్మహత్యపాతకములు ప్రకృతిద్వయాతీతమే పరమ పదము చావు పుట్టకలులేని స్వతసిద్ధమైన పరిపూర్ణాచల పరబ్రహ్మము, దీని దర్శించిన మహానుభావుడే జన్మరహితుడు. శ్లో॥ ఆత్మాతీతం కేవలాత్మ దేహానాస్తి కదాచన। అస్తినాస్తితికోవేద నిర్ణయోనాస్తిసర్వదా॥ అచల పరిపూర్ణా పరబ్రహ్మమునందేదియు పుట్టనేలేదు. సర్వము కలలోని ముచ్చట్లు భ్రాంతిలేనివారికి బ్రహ్మంబు బట్టబయలు. యిదియునుంగాక "అతిరహస్యము బట్టబయలు" యీ వాక్యము సకలజనులు మాటిమాటి కనుకొనుచున్నారే గాని దాని రహస్యమెరుగరు. లోకులమాటలు కాకులకూతలు నిజమరయలేక నలుగురేదనుకొంటే నదే వాడుక చేయుదురు. ఈ నిరావరణ బోధ పొందుటకు నిజగురు కృపయే కారణముగాని వేదశాస్త్రములచేతఁగాదు, శ్రవణాములచేతఁగాదు. ఉన్నదున్నట్టు తెలసుకొనుట మోక్ష సాధనము. ఎంతటివాడైనను మూలములేని ఈగురుతెరిగెడి శరీరమేమిలేదని సంతతము మఱువకనుండవలెను. సుషుప్తియందు ప్రకృతిద్వయములేదు కేవలాత్మయే యున్నది. సమాధియందుఁ ప్రకృతిద్వయములేదు కేవలాత్మయే యున్నది. ఊరకున్నప్పుడు ప్రకృతిద్వయము లేదు కేవలాత్మయేయున్నది. మరణమందుఁ ప్రకృతి ద్వయములేదు. కేవలాత్మయే యున్నది. యీ మైదవస్థలయందు నేలాగున్నదో ఆలాగుననే గురూప దేశానంతరము ప్రకృతి ద్వయము లేదు. కేవలాత్మయే యున్నది. సాధనముచేత సాధ్యముకాదు. జ్ఞానముచేతనే తెలియబడును. ప్రకృతిద్వయ రహితమే మౌనము అదే మహాపూజ, అదేసిద్ధి. అదే యింద్రియజయము అదే బీజరహితము. "సత్యంజన విరోధంచ

అసత్యం జనరంజకం" అసత్యమైన శరముచేసిన మార్గములను జెప్పిన వారే గొప్పవారని లోకులకు సంతోషము. ఉన్నదున్నట్టు జెప్పినవారే లోకులకు విరోధిస్తులు. "నిజమాడితే నిష్ఠూరమన్నట్లు" నిజమాడితె నందరికికోపమే. శరీరము పుట్టకమునుపు, పుట్టినవెనుక, కాలిపోయిన తరువాత నీ పరిపూర్ణాచల పరబ్రహ్మమేయుండును. ఇదే నిజవేదాంతము తక్కిన వన్నియు పలుకక్కినుమీ. ఓ సోదరులారా! నిజవేదాంతా భ్యాసము జేసినయెడల మీరు యమృతస్థానముజేరి సుఖదుఃఖములులేని బ్రహ్మానంద వారాశిలో మునుగుచుందురు. తక్కినమార్గములు నిజమైనవిగావు. సీ॥ బ్రాహ్మణోత్తములైన వైశ్యశూద్రులునైన వాంచ గలిగి। యీ నూతనబోధ యింపుగా విని వ్రాసి చదివిన జనులకు సౌఖ్యముగను। ధనధాన్యములువస్త్ర కనకభూషణములు సతిసుతుల్ హితబంధు సంఘములును। గజతురంగంబులు ఘనమైన పశువర్గ మాందోళనముశుభం బతిథిపూజ। లాయురారోగ్య భాగ్యంబు లమరిసుఖము। గలిగియుందురు మోక్షంబుగలిగి నిజము। రమ్యగుణధామ భద్రాద్రిరామసత్య। కామ కరుణాలలామ లోకాభిరామ॥ సీ॥ దశరథసుకుమార దాన సంహార మందర నగధీర మంగళంబు। నీరజదళనేత్ర నీలతోయదగాత్ర మానిజనస్తోత్ర మంగళంబు। భానుజవర్ధన భక్తజనార్ధనా మారీచ మర్దన మంగళంబు। కమలామనఃఖేన కాంచమయచేల మహనియ్యకునిశీల మంగళంబు। మన్మధాకార రఘువీర మంగళంబు। మాధవానంద గోవింద మంగళంబు॥ రమ్య॥





గద్య.

ఇతి శ్రీ కాశీక్షేత్ర నివాసులగు శ్రీమత్పరమహంసావధూత దిగంబర స్వాములవారి ప్రియశిష్యుండగు శ్రీ శంకరమంచి నారసింహ రాజయోగీంద్రులవారి ప్రియశిష్యుండగు శ్రీ తారక బ్రహ్మానుభవి, పూడిపెద్ది - సాంబశివరావుచే సకల ముముక్షువుల కుపయోగ మగునటుల స్వప్రత్యక్ష్యానుభవములతో వ్రాయఁబడిన సూక్ష్మమోక్ష మార్గము సంపూర్ణము.

శ్రీ సాంబశివార్పణమస్తు.

ఘటశోధని. ఇందు జీవునియొక్క లక్షణమంతయు చక్కగా దెలియు
నట్లు ప్రతిమలతోటి ముద్రింపఁబడియున్నది. వచనము. ౦ ౮ ౦

వేదాంతజ్ఞానసారము. ౦ ౨ ౦

భల్లాణరాజచరిత్ర వచనము. ఇది పరమభక్తుండైన భల్లాణరాజు పర
మేశ్వరుని అనుగ్రహమును బడయుట కారణముతోడ వ్రాయంబడి
యున్నది. ౦ ౪ ౦

శ్రీరామనామామృత సత్స్వరూప సంకీర్తనలు. శ్రీమద్వేదాంత పరి
పూర్ణ యచల నిర్గుణ వచనములు చేరినకీర్తనలు. ౦ ౪ ౦

శ్రీసుదర్శన రామానుజదాసుకీర్తనలు. ఇది మంచి మట్టులలో కాల
క్షేప కథలు చేయువారలకు ఆయాసందర్భములకు తగినట్లు కీర్తనలు
వుపయోగించుటకు మిక్కిలిఅనుకూలముగ నుండును. ౧ ౦ ౦

ఆశ్చర్యకథాతరంగిణి. ఇందు ధనేషణ, దారేషణ, పుత్రేషణ, అను
నీషణత్రయములను గురించియు, కామము, క్రోధము, లోభము,
మోహము, మదము, మాత్సర్యము, అను అరిషడ్వర్గముల గురిం
చియు బరమాత్మనుగురించియు అత్యద్భుతములయిన కథలు పొం
దు పఱుపఁబడి యున్నది. ౦ ౬ ౦

ప్రజ్ఞాన బ్రహ్మ బోధామృత తత్త్వసంకీర్తనలు. ౦ ౪ ౦

రాజయోగ రత్నాకరము. ౨ ౦ ౦

వేదాంతరత్నాకరము. శ్లో. తా. శంకరాచార్యవిరచితం. ౦ ౮ ౦

శ్రీమద్రామాయణ సారసంగ్రహము తాత్పర్యసహితము. ౦ ౮ ౦

సకల సువిచారసంగ్రహము. ౦ ౬ ౦

రాజయోగానందము. ౦ ౬ ౦

తత్త్వార్థముక్తా కలాపము వచనకావ్యము. ౦ ౨ ౦

అమృతబిందోపనిషత్తు. శ్లో. తా. ౦ ౨ ౦

శ్రీమన్నారాయణ స్తోత్రకదంబము. ౦ ౨ ౦

అవధూతగీత. ఇది మూలమును దానికి సరైనటీకయు తాత్పర్యమును
గల్గి అపరోక్షజ్ఞానమంతయు విస్తరముగా బోధించుచున్నది.
౧ ౦ ౦

ముముక్షుజనకల్పకము. ౦ ౬ ౦

| | | | |
|---|---|---|---|
| శ్రీరామలింగేశ్వర శతకము. | ౦ | ౨ | ౯ |
| మార్కండేయచరిత్ర స్త్రీలపాట. | ౦ | ౧ | ౬ |
| హాస్య రసమంజరి. | ౦ | ౧ | ౦ |
| వినోదకథామంజరి. ఇందు ౪౮ కథలుగలవు. | ౦ | ౪ | ౦ |
| ఉత్తరరామాయణము, కంకంటి. పాపరాజప్రణీతము, చక్కనికూర్పు. | ౧ | ౦ | ౦ |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు. | ౨ | ౫ | ౦ |
| మనుచరిత్ర, సటీక, శుద్ధప్రతి. | ౧ | ౫ | ౦ |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, దళసరికాగితములు, చక్కనికూర్పు. | ౨ | ౫ | ౦ |
| ఆముక్తమాల్యద, వావిళ్ల, రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాగితములమీఁద చక్కగ మరల ముద్రించినవి. | ౩ | ౦ | ౦ |
| దశావతారచరిత్ర పద్యకావ్యము. | ౧ | ౫ | ౦ |
| ముహూర్తసంగ్రహము. | ౦ | ౨ | ౦ |
| వాస్తుఫలసంగ్రహము. | ౦ | ౧ | ౦ |
| అర్థపంచకము. | ౦ | ౨ | ౦ |
| ఘటికాద్రి రామదాసుచరిత్రము. | ౦ | ౪ | ౦ |
| చిత్రాంగినాటకము. | ౦ | ౪ | ౦ |
| జాతకచంద్రిక. | ౦ | ౨ | ౦ |
| వైద్యచింతామణి ౨ వాల్యములు ఆంధ్ర తాత్పర్యము. | ౫ | ౦ | ౦ |
| బసవరాజీయము ఆంధ్ర తాత్పర్యసహితము. | ౭ | ౦ | ౦ |
| అధ్యాత్మ రామాయణము, టీకా తాత్పర్య సహితము. | ౫ | ౦ | ౦ |
| లోకరహస్యము. | ౦ | ౫ | ౦ |
| కవిరాక్షసీయము. | ౦ | ౫ | ౦ |

ఇంకను అనేక సంస్కృతాంధ్ర గ్రంథములు దొరకును. వలయువారు దిగువ విలాసమునకు వ్రాసికొనవలయును.

పమ్మి - త్యాగరాయసెట్టి.
శ్రీరాజరాజేశ్వరీ నికేతన ప్రెస్,
పాతచాకలపేట మద్రాసు.